**నాటి 'ముత్యాల ముగ్గు' కి రావుగోపాలరావు - నేటి 'జయసింహ' కి గొల్లపూడి హైలైట్**

ప్రతి మాటకి - **ఈలలు..చప్పట్లు..**

ఎ.వి.కె.రెడ్డి

పవన్ ఎంటర్‌ప్రైజెస్



నా పేరు కోళ్ళ సింహాద్రినాయుడు! సీమపందికి సిక్కుడు
కాయల కూరెట్టినట్టు - తప్పులు చేసే వోళ్ళందరూ - జైళ్ళకెళితే -
జైళ్ళ పరపతి పోద్ది! గాంధీబాబు. బోసుబాబు లాంటోళ్ళు
జైలు కెళ్ళేరు కానీ - రోడ్లమీద కత్తులతో పొడుసుకుంటున్నోళ్ళు
జైలు కెళ్ళేరా - ? వాళ్ళు చలవగదుల్లో చల్లగా వున్నారు!
మనమూ అంతే .

# జయసింహ



ముత్యాల సుబ్బయ్య

AGATI Rs. 2-00 September 1990

35th Year of Publication



ఎడిటర్ : చందూర్

సెప్టెంబరు - 1990

## సాహితీ సుధ

వరకృప భృత్యులందు నిజవర్గమునం దనుకూలవృత్తి కా
పురుషుల యందు శాఠ్యము బుద్ధులయం దనురక్తి దాలి స
ద్గురువుల యందు గౌరవము కోవిదులందు నయంబు రాజులం
దరి జనులందు శౌర్యము మృగాక్షుల యందు ప్రగల్భభావ మీ
వరుస గళాప్రవీణులగు వారల యందు వసించు లోకముల్

—భర్తృహరి



ప్రహ్లాద నారద బలి భీష్మ రుక్మాంగ - దార్జున పుండరీ కాంబరీష
సనకసనందన శౌనక వ్యాస ప - రాశర ధ్రువ బాదరాయణ గుహ
విదుర విభీషణ వినతాతనూభవ - గజరాజ వాల్మీకి భుజగనాథ
పవనతనూజ యుద్ధవ వసిష్ఠాది భా - గవతోత్తములు నీదు కరుణ
తావకీయాంఘ్రి సేవల దగిలి జన్మ - రహితులై కాంచిరట భవన్మహిత పదవి
సురుచిరాకార ఉన్నవ పురవిహార - రాజగోపాల రాధామనోజఖేల

—రాజగోపాల శతకం

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు.100-00

ముఖచిత్రం : ఉపరాష్ట్రపతి శంకరదయాళ్ శర్మ

# నిమ్మతొనలు

పెళ్లి చూపులు జరిగాయి. పెద్దలు మాట్లాడుకోవట మయాక, అమ్మాయీ అబ్బాయీ తమ స్వంత అభిప్రాయాలు చెప్పుకొనేందుకు, పార్కులోకి వెళ్లి, ఒక గంటసేపు కూర్చుని రమ్మనమన్నారు.

పార్కు బెంచి మీద కూర్చున్నాక, శ్రీనివాసు ఆమెని, - ఏం పుస్తకాలు యిష్టం, ఈమధ్య చూసిన సినిమాలలో ఏది బాగా నచ్చింది? - యిలాటి ప్రశ్నల అనంతరం, సుధారాణి అతనిని అడిగింది: "మీరెంత కట్నం తీసుకుంటారు?"

శ్రీనివాసు తెల్లబోయి, "కట్నం పేరిట అమ్ముడు పోయే మనిషిని కాను. నాకు కట్నం అఖ్కర్లేదు - కట్నం తీసుకోను" - అన్నాడు.

"అయితే, మన పెళ్లి జరగదు," - అంది సుధారాణి.

"ఎందుకని? నేను నచ్చలేదా?" - అని ప్రశ్నించాడు శ్రీనివాసు ఆశ్చర్యపోతూ.

"నా ఫ్రెండ్సందరూ బోలెడేసి కట్నాలు యిచ్చి, పెళ్లి చేసుకుంటున్నప్పుడు, నేను కట్నం లేకుండా చేసుకుంటే, నా కెంత షేమ్!"

—యస్ శ్రీదేవి
విజయవాడ-13

ఏరా సాంబు, బంగారు బొమ్మలాటి పిల్లని పెళ్లిచేసుకు వచ్చావట. మా కెవరికీ చెప్పకుండానే చేసుకున్నావ్!" - అని నిందవేస్తూ అడిగాడు రంగారావు బాబాయి.

"మా ఎదురింట్లోని పరంధామయ్యగారి భార్య, మొగుడిని తిట్టేతిట్లూ ఆడిపోసుకొనే మాటలు విన్నాక, బుద్ధిమంతురాలైన అమ్మాయి తటస్థపడితే గాని పెళ్లిచేసుకో కూడదనుకున్నాను," అని చెప్పాడు సాంబశివరావు గర్వంగా.

"అందంతో బాటు అణకువ కూడా గల అమ్మాయన్న మాట?"

"పార్వతి నోరు విప్పి ఒక్క మాట మాట్లాడదు."

"అంత కట్టడిలో పెట్టడం మంచిది కాదు. మాట్లాడనివ్వాలి - తన మనసులో మాట చెప్పనివ్వాలి" అన్నాడు రంగరావు బాబాయి, హితవు చెబుతున్నట్లుగా.

"ఆమె ఏనాడూ మాట్లాడి ఎరుగదు, అన్నీ సైగలే - పుట్టుకతోటే మూగ."

—ఆరెస్ నాగేశ్వరరావు
మాచర్ల

సంపాదకునికి లేఖలూ మినీకథల తో తృప్తి చెందక, ఒక పెద్ద కథ రాద్దామనుకున్న పాఠకురాలు, వర్ధమాన రచయిత్రి శ్యామసుందరి వద్దకు వెళ్ళి, "మీకు మూడ్ ఎలా వస్తుందండీ?" అని అడిగింది.

వెంటనే బోధపడక, "మళ్ళీ చెప్పండి" - అంది శ్యామసుందరి.

"మీరు రెండు నవలలూ, పద్నాలుగు కథలూ వ్రాశారు కదా - కథ వ్రాయాలనే మూడ్ మీకు ఎలా వస్తుందండీ?" - అని ప్రశ్నించింది పాఠకురాలు.

"ఓ అదా? మిరపకాయ బజ్జీలు తింటే సరి."

'ఇదా రహస్యం' అనుకుంటూ తృప్తి పడింది పాఠకురాలు.

—కె రామకృష్ణ
రేపల్లె

డాక్టరు గారూ, నాకు చాలా పొడవుగా ఎదగాలని ఉందండీ. అందరికంటె చాలాపొడుగ్గై, గిన్నీస్ బుక్‌లోకి ఎక్కి ఆవిధంగా ప్రపంచ ఖ్యాతి పొందాలని నా కోరిక, 'పొడవు ఎ ద గ ం డి' అడ్వర్టయిజ్‌మెంటుల్లో చెప్పిన ప్రకారం మందు వాడితే నిజంగా పొడవవుతా నంటారాండీ?" - అని ప్రశ్నించాడు సుదర్శనం.

"మీ కెంత పొ డ వ వా ల ని ఉంది?"

"చెట్టంత పొడవు! పన్నెండూ పద్నాలుగడుగులకి మించి ఎవరూ లేరట."

"అలాగనా? మీకు చెట్టంత అవాలని ఉంది. అంతేకదు ప్రకటనలు నమ్మి మోసపోకండి - నా దగ్గర మంచి మందు వుంది." - అని చెప్పాడు డాక్టరు.

డాక్టరుగారిచ్చిన డబ్బా చేతిలో పుచ్చుకు సుదర్శనం అడిగాడు: "ఈ మాత్రలు ఎలా వాడాలి?"

"అవి మాత్రలు కావు - చెట్ల విత్తనాలు"

—జి రాము
నందిగామ




# జి. పుల్లా రెడ్డి
## స్వచ్ఛమైన నేతి మిఠాయి

హైదరాబాదు — ఫోను: 230833

కర్నూలు — ఫోను: 20288, 2144




# పాఠకుల తీర్పు

చందూర్‌గారికి : వందనములు. నేను కొత్తగూడెం నుంచి మళ్లీ ఢిల్లీ ట్రాన్స్‌ఫరయాను.... శ్రీశైలం, విజయవాడ ప్రయాణాల గూర్చి 'డైరీ' లో వ్రాసిన వివరణ బాగుంది. కేసరి గారి 'ముచ్చట్లు' ఎంతో ఆసక్తికరంగా ఉంటున్నవి.

—ఆర్‌ఎ పద్మనాభరావు
ఢిల్లీ-9

యన్నార్ చందూర్‌గారికి అచ్యుత వల్లి నమస్కారములు. మీరు కేసరి గారి జీవితచరిత్ర వేయడం అభినంద నీయం. అది చదువుతూవుంటే, ఆ రోజుల్లోకి మనోకవాటాలు తెరుచుకొని పరుగెత్తగలుగుతున్నాము. ఆనాటి సంసారాలు, జీవితాలు చక్కగా వర్ణించారు.... అట్టహాసం లేకుండా, నిర్మలంగా నెమ్మదిగా మనస్సుని ఆకట్టుకొనే రీతిలో, ప్రపంచ విషయా లను మన మనోదర్పణం ముందుంచు తున్న ఈ చిన్న 'జగతి' పెద్దది అవదా ? ముప్పయ్యయిదు సంవత్సరా లుగా, ప్రతినెలా క్రమబద్ధంగా వెలు వడుతున్న ఈ చిన్న 'జగతి' పెద్ద దిగా అవాలనే పాఠకుల కోర్కెను, మీరు తీర్చగలరని ఆశిస్తూ, శుభాభి నందనలతో....

—కెవియస్ అచ్యుతవల్లి
రాజమండ్రి-5

యన్నార్ చందూర్‌గారికి : నమస్కారములు.... 1990 జులై సంచిక లోని 'ప్రజాజీవితంలో హింసాత్మక పద్ధతులు' వ్యాసం నన్ను ఎంతగానో కదిలించింది. హింస విస్తృతమవుతున్న ప్రస్తుత తరుణంలో మీ వంటి సహృదయులు, సాధు జీవనులు అహింస గురించి చాటి చెప్పవలసిన అవసరం ఎంతైనా వుంది. పెడదారి పడుతున్న నేటి యువతరానికి, తగిన మార్గదర్శనం చేయించడానికి ఇటు వంటి ప్రబోధాలు ఎంతో అవసరం. మిమ్మల్ని పొగడడానికి వ్రాయడం లేదు. ఈనాడు దేశం మంచిని మరచి పోతోంది. ఆదర్శాలు లేని యువత తయారవుతోంది. సమాజంలోని చెడు ప్రభావానికి వారు సులువుగా తల ఒగ్గుతున్నారు. రాజకీయ నాయకులు శాంతివచనాలు పలుకుతున్నా, ఏదో ఒక రీతిలో హింసను ప్రోత్సహించక తప్పని పరిస్థితిలో వారు ఉన్నారు. దేశహితాన్ని కోరే అందరూ అహింసను ప్రోత్సహించవలసి ఉంది.

—మండలి బుద్ధప్రసాద్
అవనిగడ్డ



# వెన్నెల కెరటాలు

## ప్రకటన వ్యయం

ఆపరేషన్ రిసెర్చ్ గ్రూప్ లెక్కల ప్రకారం గత సంవత్సరము తొమ్మిది వందల కోట్ల రూపాయలు ప్రకటనలకు వెచ్చించారు. అంతకు ముందు ఏడాదితో పోలిస్తే, ఇది ఇరవై ఎనిమిదిన్నర శాతము ఎక్కువ. మొత్తము తొమ్మిది వందల కోట్లలో ఆంగ్ల పత్రికలు ఐదువందల మూడు కోట్ల రూ॥ సంపాదించి అగ్రస్థానములో నిలబడితే, హిందీ పత్రికలు నూట ముప్ఫయ్ నాలుగుకోట్ల, ఇతర భాషా పత్రికలు అన్నీ కలిసి మిగిలిన రెండు వందల అరవయ్‌మూడు కోట్ల రూ॥ సంపాదించాయి. భాషా పత్రికలలో, పంజాబి, తెలుగు, ఉర్దూ పత్రికలలో వ్యాపార ప్రకటనల వ్యయం గత ఏడాదితో పోలిస్తే కొంత తగ్గింది. దిన, వార, మాస పత్రికలుగా విడదీసి చూస్తే 86% ప్రకటనలు దిన పత్రికలను ఆక్రమించాయి. 10.7% వార, పక్ష పత్రికలు, 3.2% మాస పత్రికలు ప్రచురించాయి.

—వార్తా విశేషం
'సర్కార్ ఎక్స్‌ప్రెస్'

## 'ముసలమ్మ మరణము'

మూడో అధ్యాయంలో 'ముసలమ్మ మరణము' కావ్యావిర్భావానికి గల పూర్వాపరాలను చర్చించి, నవ్యతను విశదపరచారు. నాల్గవ అధ్యాయంలో కట్టమంచివారి ప్రభావం ఎవరెవరిపై ఏలా పడిందో విశ్లేషించి చూపబడినది. అయిదవ అధ్యాయంలో కట్టమంచివారి వ్యక్తిత్వాన్ని గూర్చి పండితుల, విమర్శకుల అభిప్రాయాలు క్రోడీకరించబడి, ఆధునిక సాహిత్యంలో వారి స్థాననిర్ణయం మొదలగు విషయాలు పేర్కొనబడినవి. దామోదర రెడ్డిగారు ప్రతి అధ్యాయంలో ఆయా విషయాలను వివేచనతో విశ్లేషించి వివరించారు. విషయ విశ్లేషణలో, వివరణలో రచయిత బుద్ధిచాతుర్యం, పరిశీలన పటిమ వెల్లడౌతున్నాయి. రచనాశైలి సరళమై స్పష్టంగా పఠితలను చివరంటా చదివించే రీతిలో ఉన్నది.

—వేముగంటి
'స్రవంతి'లో



# పాతికేళ్ల నాటి పిక్చర్

అన్నపూర్ణా వారి

## 'ఆత్మ గౌరవం'

శతదినోత్సవం జరుపుకొనేందుకు ఎటువంటి సన్నివేశాలూ, సందర్భోచిత సంభాషణలూ, ఛెళుకులూ కావాలో అన్నపూర్ణావారికి బాగా తెలుసు. (నిర్మాత : డి మధుసూదనరావు - దర్శకత్వం : కె విశ్వనాథ్). ఒక అమ్మాయివెంట యిద్దరు మగపిల్లలు పడితే అందులో ఒకనికి స్వస్తివాచకం చెప్పాలి. అదే ఒక అబ్బాయివెంట యిద్దరు అమ్మాయిలు పడ్డారా, ఒక అమ్మాయిని ప్రియబాంధవిగా అట్టే పెట్టేసి, రెండో అమ్మాయి మెడలో మూడు ముళ్లూ వేయించవచ్చు.... 'మనిషి తెలియాలి, మనసు కలవాలి, మరచిపోలేని స్నేహాన కరగాలి, ఆ పైన మధుర ప్రణయాలు మనువుగా మారాలి' - అని వక్తృత్వపు పోటీలో ఒక పాట పాడి, ఫస్ట్ ప్రయిజ్ కొట్టేసిన వాసుని (నాగేశ్వరరావు), ద్వితీయ బహుమతి పొందిన జడ్జిగారమ్మాయి గీతాదేవి (రాజశ్రీ) ప్రేమిస్తుంది. మాజీ న్యాయమూర్తి బాజా (అసలు పేరు : నీలకంఠం భజగోవిందం - రమణా రెడ్డి), వాసు పెంపుడు తండ్రి హోలూ (జమీందారు వరహాలు - రేలంగి) చిన్ననాటి స్నేహితులవడంవల్ల, వీరి పెళ్లికి ఒక విధంగా లైన్ క్లియర్ యిచ్చేసినట్లే. కాని వాసు అన్నగారైన రైతు రామయ్య (గుమ్మడి) భార్య చనిపోవడం, మేనకోడలూ చిన్ననాటి చెలికత్తె అయిన సావిత్రి (కాంచన) తప్పిపోవడం, 'చిగురులు వేసే వయసులో చెలగాట మెందుకని' డ్యూయెట్ పాడి వస్తున్న గీతాదేవి కారు కింద ఈ సావిత్రి పడి, సరళగామారి, సేవా సదన్‌లో చేరి, అనతికాలంలోనే అపురూప నాట్యరాణియై, 'యిన్నాళ్లకు నవ్వెను మల్లియల'నుకుంటూ, వాసు మామ చెంతచేరి, అతని హృదయంలో ఒదిగిపోతుంది. జమీందారుగారి భార్య సంతానలక్ష్మి (సూర్యకాంతం) చెల్లెలు కొడుకు వేణు (చలం) గీతాదేవిని రహస్యంగా ఆరాధిస్తూ వుంటాడు. కాని పైకి చెప్పే దమ్ములు వుండవు : కొన్ని అవాంతరాలు దాటాక 'ఆత్మ గౌరవం' గల రైతు రామయ్యకు తగిన సోదరుణ్ణనిపించుకుంటాడు వాసు. సావిత్రితో అతనికి పెళ్లవుతుంది. ఎవర్‌గ్రీన్ హీరో నాగేశ్వరరావుకి చెరోవైపునా చక్కగా నటించారు కాంచన, రాజశ్రీ.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - ఏప్రిల్ 1966

అందరి విషయంలోనూ ఔదార్యంగా వుండవచ్చుగాని స్వ విషయంలో మాత్రం నిక్కచ్చిగా వుండండి.

—సెయింట్ థెరిసా

## మానవ ప్రగతి

## డాల్ఫిన్ రక్షణ

ప్రపంచంలో మరెక్కడా లేని విధంగా.... పసిఫిక్ మహాసముద్ర తూర్పు ప్రాంతపు జలాలలో డాల్ఫిన్‌లు, 'టూనా' చేపలు కలసికట్టుగా విహరిస్తాయి. డాల్ఫిన్‌లు ఈ ప్రాంతంలో 'టూనా' చేపలతో అలా ఎందుకు కలసి మెలసి వుంటున్నాయనేది ఎంతో కాలంగా శాస్త్రవేత్తలకు అంతు చిక్కని అంశంగా వుంది..... కాగా 'టూనా'లతో కలసికట్టుగా వుండడం వల్ల తూర్పు పసిఫిక్ జలాలలోని డాల్ఫిన్‌ల మనుగడకు ఇప్పుడు తీవ్రమైన ముప్పు ఏర్పడే పరిస్థితి ఉత్పన్నమైంది. 'టూనా' చేపల వేటకు ఉపయోగించే 20 నుంచి 50 కిలోమీటర్ల పొడుగైన 'డ్రిఫ్ట్' వలల వల్ల డాల్ఫిన్‌లు చనిపోతుండడం పర్యావరణ ప్రియులకు తీవ్ర ఆందోళన కలిగిస్తోంది. ఉత్తర, దక్షిణ అమెరికా తీరాలలోని పసిఫిక్ జలాలలో ఈవిధంగా ఏటా సుమారు లక్ష డాల్ఫిన్‌లు చనిపోతున్నాయని అంచనా. డాల్ఫిన్‌లు అప్పుడప్పుడు సముద్ర ఉపరితలానికి చేరుకుని అక్కడ గాలి పీల్చుకుంటాయి. అయితే 'టూనా' చేపల కోసం అమర్చిన భారీ వలలలో అవి చిక్కుకొనిపోయి... ఉపరితలానికి వెళ్ళి గాలి పీల్చుకొనే అవకాశంలేక, అవి చనిపోవడం జరుగుతున్నది. డాల్ఫిన్ ఎంతో తెలివైన జలచరంగా పేరు పొందింది. టూనా చేపలకోసం వలలు ఏర్పాటు చేసినప్పుడు ఆ వలలో చిక్కుకు పోయిన పెక్కు డాల్ఫిన్‌లు తిరిగి ఆ వలను తీసేవరకు ఖంగారు పడకుండా ఓర్పుగా వేచివుంటాయని, అయినప్పటికీ ఈ వలల కారణంగా డాల్ఫిన్‌లకు ముప్పు అధికమవుతున్నదని పరిశీలకులు పేర్కొన్నారు. కాగా అమెరికాలో 'టూనా' చేపల వర్తకానికి ప్రసిద్ధి చెందిన మూడు అగ్రశ్రేణి సంస్థలు.... డాల్ఫిన్‌ల మృతికి కారణమవుతున్న 'డ్రిఫ్ట్' వలలతో పట్టుకునే 'టూనా' చేపలను ఇక మీదట కొనరాదని నిర్ణయించుకోవడం పర్యావరణ పరిరక్షణ రంగంలోని వారికి ఎంతైనా సంతోషాన్ని కలుగజేసింది. 'బంబుల్ బీ', 'చికెన్ ఆఫ్ సీ', 'స్టార్

కిస్ట్ సీ ఫుడ్' అనే ఈ సంస్థలలో 'స్టార్‌కిస్ట్' సంస్థ 'టూనా' చేపలను డబ్బాలలో వుంచి ఎగుమతి చేసే సంస్థలన్నిటిలోకి (ప్రపంచం మొత్తం మీద) అతిపెద్దది కావడం గమనార్హం.

## మణిపూర్‌లో

1979 నుంచి ఇప్పటివరకూ మణిపూరులో 62 గ్రామీణ కమ్యూనిటీ శాలలు నిర్మించారు. సాంప్రదాయకంగా వస్తున్న మణిపూరి ఆచారం ప్రకారం అక్కడ గ్రామీణులు ఒక చోట చేరి, తమ తమ సాధకబాధకాలను గురించి చర్చించుకుంటూ వుంటారు. దీనిని 'మొరుంగ్' అని అంటారు. మారుమూల గిరిజన ప్రాంతాలలో నిర్మించారు. మణిపూర్‌లో ఇప్పుడు మొత్తం సుమారు 3 లక్షల మంది గిరిజన ప్రజలు వున్నారు. ఇందులో దాదాపు 2 లక్షల మందికి ఈ కమ్యూనిటీ హాలు సదుపాయం వుంది. గ్రామస్తులు, ముఖ్యంగా గిరిజనులు, తమ సమావేశాలు జరుపుకొనేందుకు ఇవి కేంద్రాలు. వీటిలో ఆటలకూ, సాంస్కృతిక కార్యక్రమాల, ప్రదర్శనలకూ ఏర్పాట్లు ఉన్నాయి. బలహీన వర్గాల వారు ఇలా సమావేశాలు జరుపుకుని, వినోద కార్యక్రమాలు తిలకించి, ఆనందమయంగా తమ జీవనాన్ని కొనసాగించేందుకు, ఈ కమ్యూనిటీ శాలలు ఉద్దేశించబడ్డాయి.

## ఆయిల్

దేశఆర్థిక వ్యవస్థలో ఆయిల్‌కు గల పాత్ర, అత్యంత కీలకమైనది. దేశ ప్రగతి ఆయిల్ పుష్కలంగా లభ్యం కావడంపైనే ఆధారపడి ఉంటుంది. పారిశ్రామిక, రవాణా రంగాలకు, రసాయన తదితర పరిశ్రమలకు ప్రధాన ఇంధనంగా ఆయిల్ కీలకమైన పాత్ర నిర్వహిస్తున్నది. స్వాతంత్ర్యానికి పూర్వం ఆయిల్ పరిశ్రమ ఉన్న పరిస్థితిని, ప్రస్తుతం ఉన్న పరిస్థితిని పోల్చి చూస్తే బ్రహ్మాండమైనంత మార్పు కన్పిస్తుంది. స్వాతంత్ర్యానికి పూర్వం మన దేశంలో ఆయిల్ ఉత్పత్తి కేవలం ఐదులక్షల టన్నుల మాత్రమే. ప్రపంచంలో కల్లా అతి పురాతనమైన చమురు క్షేత్రాలలో ఒకటైన డిగ్బాయ్‌లో మాత్రమే ఆయిల్ ఉత్పత్తి జరిగేది. వర్తమాన ఆర్థిక సంవత్సరం (1989-90) ముగిసే నాటికి దేశంలోని వివిధ ఆయిల్ నిక్షేపాల నుంచి 35 మిలియన్ టన్నుల క్రూడ్ ఉత్పత్తి కాగలదని అంచనా. దేశంలో ఆయిల్ ఉత్పత్తులు ప్రస్తుతం 60 మిలియన్ టన్నుల మేరకు అవసరం అవుతున్నాయి. అంటే దేశీయావసరాలు 60 శాతం భాగాన్ని దేశంలోని ఉత్పత్తులు తీర్చగలుగుతున్నాయి. ఆయిల్ పరిశ్రమ గడిస్తున్న లాభాలు కూడా గణనీయంగా పెరుగుతున్నాయి. 1983 - 84 లో ఈ పరిశ్రమ ఆర్జించిన లాభం రూ. 138 కోట్లు కాగా, 1988 - 89 లో ఈ లాభం రూ. 915 కోట్లకు పెరిగింది. ఆర్థికపరంగా నిర్ణయించిన లక్ష్యాలను ఆయిల్ పరిశ్రమ అధిగమించ గలగడమే కాక, రిఫైనరీలు, పైపు

లైనులు, వంటగ్యాసు, బాట్లింగు యూనిట్ల సామర్ధ్యాన్ని అతిగరిష్ట స్థాయిలో సాధించడంతో పాటు, మాధ్యమిక ఉత్పత్తుల స్థాయినికూడా పెంచడం ద్వారా ఈ పరిశ్రమ ఆదాయాన్ని పెంచుకొన గలుగుతున్నది. ఏ ప్రమాణాల దృష్ట్యా అంచనా వేసినా, మన ఆయిల్ పరిశ్రమ ప్రశంసార్హంగా ఉంది. రిఫైనరీలను గరిష్టస్థాయి వినియోగించుకొనడంలో అధికాదాయాన్ని సమకూర్చే మాధ్య మిక ఉత్పత్తుల సాధనలో మన ఆయిల్ పరిశ్రమ విజయాలను అంతర్జాతీయ నిపుణులు కూడా ప్రశంసించారు. అంతర్జాతీయంగా అతిపెద్ద కంపెనీలుగా పేరొందిన 100 కంపెనీలలో ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ ఒక్కటే స్థానాన్ని సంపాదించగలిగింది. అంత పెద్దదైన 500 కంపెనీల జాబితా రూపొందించినప్పుడు అందులో మనదేశానికి చెందిన ఆరు కంపెనీలకు స్థానం లభించింది. ఆరింటిలో కూడా నాలుగు కంపెనీలు ఆయిల్ కంపెనీలే!







జెమిని పళ్ళపొడి

జెమిని కెమికల్ ప్రొడక్ట్స్ (ఫర్మ్) పోస్ట్ బాక్స్ నం. 7,
మచిలీపట్నం-521 001. ఆం ప్ర. (ఇండియా)

పళ్లకు తెలుపుదనం – చిగుళ్లకు గట్టిదనం.

"When the stipulated period of one month is almost over, Angada and his band of followers plan to commit suicide instead of facing the wrath of Sugriva and receive the death penatly from him..." said Raghu.

"You are correct, Raghu, but just then they happen to come across Sampati who gives them valuable information as to the whereabouts of Sita in Lanka."

"They say Sampati is a wingless vulture and how could he come to know of it," questioned Raghu.

"He heard it all thro' his son Suparva and you should not forget that Sampati has been waiting since ages for that golden moment. Jatayu and Sampati are brothers and in their prime of youth, they compete with each other in flying high. In a bid to win, while Sampati soars up higher and higher, Jatayu starts falling down and Sampati saves his brother but loses the wings due to scorching heat. Sage Nishakara consoles Sampati that he would regain his wings after divulging crucial information to Rama. With his vulture's eye, Sampati could see beyond the normal sight and describes in detail about Lanka and the captivity of Sita therein. As Vanaras get that news, Nishakara's prophecy comes true with Sampati getting back his wings'" explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*



# పని - హక్కు

యన్నార్ చందూర్

సుమారు ఏభై ఏళ్ల క్రితం రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభ మయాక, ప్రపంచ మేధావులు కొందరు సమావేశమై, మానవ హక్కుల ప్రణాళిక, అని ఒక డిక్లరేషన్ ప్రకటించారు-డిక్లరేషన్ ఆఫ్ ది రైట్స్ ఆఫ్ మాన్, మానవునికి, పుట్టడం తోటే కొన్ని హక్కులు వస్తున్నాయనీ, వాటి పరిరక్షణ సమాజానిదీ ప్రభుత్వానిదీ అనీ, ఆ ప్రకటనలోని సారాంశం, అంతరార్థం.

ప్రధానమైనవిగా వారు పది హక్కులు పేర్కొన్నారు :

1) ప్రతి మనిషీ ఈ ప్రపంచంలోని సహజ వనరులకు, శక్తులకు, పరిశోధనలకు, అవకాశాలకు, స్త్రీ పురుష విభేదం లేకుండా, రంగు, జాతి, మతము అనే తేడాలు లేకుండా, ఉమ్మడి వారసత్వం కలిగి వున్నాడు ;

2) సామాన్యమైన చదువు, ప్రత్యేకమైన చదువుతో విజ్ఞానం పెంచుకుంటూ, సమాజశ్రేయస్సుకు తోడ్పడగల హక్కు కలిగి వున్నాడు ;

3) తన శ్రమకు తగు ఫలితాన్ని యిచ్చే, ఎటువంటి న్యాయ సమ్మతమగు కృషిలోనైనా, అతను నిమగ్నుడు కావచ్చు ;

4) తన కిష్టమైన చోట, స్వంత ఆస్తి కొనుక్కోవచ్చు ; దానిని అమ్ముకోవచ్చు ;

5) ఈ స్వంత ఆస్తిని తనదిగా దాఖలు పరిచి, దానిని కాపాడవలసిన బాధ్యత తీసుకు, చట్టపరమగు రక్షణ యివ్వాలి ప్రభుత్వం ;

6) తన స్వంత ఖర్చుతో, తన యిష్టం వచ్చిన రీతిని, ప్రపంచం నలుమూలలా, ఆయాదేశ నిబంధనలకు లోబడి, పర్యటించవచ్చు ;

7) ప్రమాదకరమైన ఉన్మాది అని డాక్టరు సర్టిఫికేట్ యిస్తే తప్ప, ఆరు రోజులకిమించి ఎవరినీ జైలులో ఉంచకూడదు ; న్యాయ విచారణ లేకుండా మూడు నెలలకు మించి వుంచకూడదు;

8) కార్యాలయాలలోని చిన్న ఉద్యోగులపై 'గుప్త సమాచారం' అంటూ పైవారికి ఫిర్యాదులు పంపకూడదు ;

9) కొట్టడం, హింసించడం, దైహికంగా బాధించడం యిటువంటి పనులు చేయకూడదు ;

10) ఇవి ప్రపంచంలోని అన్ని దేశాల ప్రజలకు సహజంగా సంక్రమించే ప్రాథమిక హక్కులు - ఫండమెంటల్ రైట్స్.

ఈ హక్కులవెంట కొన్ని డ్యూటీస్ (విధ్యుక్తాలు) - అవి కూడా చెప్పారనుకోండి. వాటికంటె హక్కుల జాబితాయే వినడానికి బావుంటుంది.

"మేము వీటిని మామూలు మాటలలో చెప్పాము. చట్టపరమగు పదజాలంతో వీటిని క్రోడీకరిస్తే తప్ప, యివి అమలులోకి వచ్చే అవకాశం లేదు" - అన్నారు ఆ మేధావులు.

ఈ మానవ హక్కుల ప్రణాళిక గురించి గాంధీగారితో చెప్పినప్పుడు, ఆయన పెదవి విరిచి, 'హక్కులదేముంది? - ఎవరి బాధ్యత వారు నెరవేరుస్తే, హక్కులు వాటంతటవే సంక్రమిస్తాయి' - అన్నారట నవ్వేస్తూ.

'స్వరాజ్యము నా జన్మ హక్కు' - Swaraj is my birthright - అని బాల గంగాధర్ తిలక్, నినాదం లేవదీసే దాకా, 'హక్కు' అనే మాట మనకు అంతగా వ్యాప్తిలో ఉండేది కాదు. డ్యూటీస్, రెస్పాన్స్‌బిలిటీస్, అబ్లిగేషన్స్ - వీటన్నిటినీ మనం కర్తవ్యాలుగా బాధ్యతలుగా చెప్పుకొనే వారం 'England expects every man to do his duty' అన్నప్పుడు ఆంగ్ల ప్రజానీకంలో దేశభక్తి పెల్లుబికింది.

మన రాజ్యాంగ శాసనం ప్రాథమిక హక్కులు ప్రసాదించినప్పటికీ భారతీయ సంస్కృతీ స్రవంతి బాధ్యతల మీదనే బరువు మోపుతుంది. అనేకానేక కారణాలవల్ల జనావళికి, ప్రతిదానికీ ప్రభుత్వం మీద ఆధారపడటం ఈ మధ్య బాగా అలవాటైపోయింది. ప్రభుత్వ ఉద్యోగం దొరికితే రిటైరయేదాకా బాధలేదు - జీవితానికిక తడుముకోవలసిన పని ఉండదు - అదీ సగటు మనస్తత్వం, వేర్వేరు రాజకీయ పార్టీలు ఆ మనస్తత్వానికి అనుగుణం. గానే బృందగానం చేస్తూవుంటాయి.

వెనకటికొకసారి 'మిలియన్ జాబ్స్' అని ఒక చిన్న పుస్తకం వచ్చింది. పది లక్షల కొత్త ఉద్యోగాలు యివ్వబోతున్నామని చెప్పారు. ఏడాది తిరక్కుండా ఆ విషయమే మర్చిపోయారు - యితరమైన వత్తిళ్ల వల్ల!

'రైట్ టు వర్క్' - ప్రతి పౌరునికీ చేసేందుకు ఒక పనికావాలి. వారి వారి విద్యాశిక్షణని బట్టి, వారి వారి సామర్ధ్యాన్ని బట్టి, తమకు అనుకూలమైన పని లభించాలనుకుంటారు. భారత దేశంలో 75 నుంచి 80 శాతం దాకా రైతాంగం. వారు తమ 'రైట్ టు వర్క్' ఎవరినీ అర్ధించరు. అటువంటి క్లిష్ట విషయాలు చెవిని పడకుండానే, వారి జీవితాలు వెళ్లిపోతూంటాయి.

ఈ 'రైట్ టు వర్క్' సమస్య పట్టణ ప్రాంతాలలో నిరుద్యోగుల్ని, కొద్దో గొప్పో చదువుకున్న వారిని, అధికంగా బాధిస్తూవుంటుంది. ప్రస్తుతం మనదేశంలో 30 మిలియనులు, అంటే మూడు కోట్లమంది, నిరుద్యోగులు వున్నారని అంచనా. గ్రామీణ ప్రాంతాలలో పరిశ్రమలు నెలకొల్పడం,

హస్తకళలు, చేనేత పరిశ్రమ మున్నగు వాటికి ప్రోత్సాహమివ్వడం, ఉన్నత విద్య అభ్యసించిన యువతీ యువకు లకు 'టైనీ' పరిశ్రమలు ప్రారంభించ గల అవకాశం కల్పించడం, సహకార రంగాన్ని విస్తృత పరచడం - ఈ విధంగా యువతకు చేయూతనివ్వగల గాలి. నవభారత నిర్మాణంలో తాము భాగస్వాములమని నమ్మకం కలిగించిన మీదటనే, యువత తను చేబట్టేది ఫల ప్రదం చేయగలుగుతుంది.

యువజనులు ఈనాడు చాలా నిస్పృహతోను, నిరాశతోను వున్నారు. వారికి నాయకత్వం మీద, పెద్దలమీద గురి వుండటం లేదు. యువతలో ఆత్మ విశ్వాసమూ, నూతనోత్తేజమూ కలిగించ వలసిన బాధ్యత పాలకులపై ఉంది.

సర్ థామస్ మోర్ రచించిన 'యుటోపియా' కారణంగా ఇంగ్లండులో 'ది పూర్ లా' అనే శాసనం అమలు లోకి వచ్చింది. ఆ 'పూర్ లా' కారణంగానే, తిండి, బట్ట, తలదాచుకొనే నీడ - సమకూర్చవలసిన భారం ప్రభుత్వానిది అయింది. ఆ వరవడే మిగతా సభ్యదేశాలన్నీ అనుకరించి, సంక్షేమ పధకాలు ఆచరణలో పెట్టాయి. ప్రజాసంక్షేమ దృష్ట్యా పేదలను నిరుద్యోగులను ఆదుకోవడం ప్రభుత్వం వారి బాధ్యతలలో ఒకటయింది .... కేంద్ర ప్రభుత్వం కొత్తగా ప్రవేశ పెట్టనున్న శాసనం ద్వారా యువతకు అనేక విధాల మేలు జరగవచ్చు.

—'ఆకాశవాణి' సౌజన్యంతో




జమ్మి వారి

# లివర్ క్యూర్



పసిబిడ్డలకు యేర్పడు కామెర్లు (జాండీస్) ఆకలి లేమి, మలబద్ధకము, మలము తెల్లగా పోవుట, మూత్రము విసర్జించినచోట తెల్లగ మరక కట్టుట— మొదలైనవి లివరు వ్యాధి సూచనలగును.

ఈ వ్యాధిని నిర్మూలించుటకు 'జమ్మి' వారి డాక్టరును సంప్రదించండి.

ప్రతినెలా వారి డాక్టరు మీ ఊళ్లకు వచ్చెదరు.

జమ్మి ఫార్మస్యూటికల్స్

'జమ్మి బిల్డింగ్స్'

**61,** రాయపేట హైరోడు, మద్రాసు - **600 004** - ఫోన్ నెం. **72539**




# చందూర్ రచనలు

| | |
|---|---|
| నేటి విలువలు | పరిచయం చేసిన పుస్తకాలు |
| దూరాన్ని జయించిన మానవుడు | అన్యాయం |
| ఛార్లెస్ స్టీన్‌మెజ్ | ఆఖరి కోరిక |
| కథానికలు | ఎక్కడికి కమలా ? |
| జీవనమార్గం | భానుమూర్తి భార్య |
| ఎలినార్ రూజ్‌వెల్ట్ | రాధ నవ్వింది |
| తొలి పాఠాలు | కొత్త లోకాలు |
| ప్రేమగాథ | కొన్ని గ్రంథాలు |
| హెలెన్ కెల్లర్ | సీతతో సినీమాకు |
| డా॥ మేరి వెర్లిస్ | ప్రజానాయకుడు ప్రకాశం |
| నేల - నీరు | నట్టింట దీపం |
| మహా నగరంలో | మాంగుళూర్ మెయిల్ |
| జీవితం | మహాబలిపురం |
| నవచైనా | మనకీ ఒక కారు |
| ప్రతి గురువారం | సీతా ఫలాలు |
| ఆరు కథలు | భాష |
| చెట్లు | పూసల మేడ |
| మరొక ఆరు కథలు | శివరావు |
| ఈ నాగరికత | కలడోలేడో |
| నాలుగు రోడ్లు | మావో పాలనలో |
| అణుశక్తి | చైనాలోమైనారటీలు |
| బాలరాజ్యం | అమెరికా |
| గ్రామ వైద్యుడు | జులై నాలుగు |
| సాహస యాత్ర | వరదల్లో వాంగ్ |
| అంతేనా | మాతా భూమాతా |
| కాఫీ మానెయ్యటం | పీమలబారు |

వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలను కున్నవారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి

# A Week in Kerala

*Saturday - July 30, 1988*

Our plan was to move out for Trivandrum by nine but it was past ten by the time we actually got down from the upstairs and Driver Sasi assured us that all luggage had been properly arranged in the dicky. The nose rim of my sunglasses was broken and the first thing we had to do before leaving Ernakulam was to purchase a new frame for the glasses. Siva Swamy took us to a famous shop known to him and they fitted the cooling glasses into a new frame in a record time of five minutes.

From there we proceeded to an electrical goods shop where we purchased batteries for the tape-recorder. It was doubtful whether we would be in a mood to play tapes while so much of gossip was in store but everything should be spick-and-span. In fact we didn't tune on even for ten minutes as we had a lot of interesting notes to compare and Siva Swamy's recitation of poems from the Telugu Classics thrilled us. Reciting a Padyam has its own pleasure and flavour in Telugu.

The first important place we came across after a drive of 62 km was Alleppey. There is a boat-service as well between Cochin and this place and the old town is called the Venice of India for its picturesque setting. With extensive paddy fields, palm groves, silent backwaters, carpet-weaving, boat-racing, Alleppey is a blend of the old and the new, with plenty of commercial activity. Journey by motor launch in the backwaters, they say, will be an enchanting experience.

In Alleppey there is Mullakal Devi Temple with no roof above the sanctum sanctorium and nearabout Alleppey there are temples of Lord Krishna (Ambalapuzha - 14 km), of Subrahmanya Swamy (Haripad - 34 km) and Snake Temple (3 km north-west of Haripad). As we were not keen on visiting those shrines, we proceeded to Quilon. Trivandrum is just 71 km from here. Quilon is a leading centre of cashew-crop and ceramic industries. We saw t

Asthamudi Lake and the bridge that was in news recently. In broad daylight that bridge broked own and a few bogies of the Bangalore-Trivandrum Express fell into the lake resulting in a watery grave to a number of passengers. Worst disaster and human calamity apart, the subsequent findings attributed the cause to a typhoon of which no one heard earlier.

After lunch at Quilon, we were on road to Trivandrum. Accommodation for us was booked in Hotel Chaitram - quite an interesting name. Rooms were airy, spacious and comfortable and after a journey of 223 km. one would feel like having a shower. Hot water was there but we preferred cold water. Refreshing ourselves with bath and a change of clothes, the four of us went to the nearby railway canteen for coffee. It was thro' Driver Sasi we learnt that the railway canteen was the best. From there we drove to the Padmanabha Swamy Temple in Chalai Bazar.

This temple, known as Ananthasayanam as well, has a lot of legend and history behind it. It is said that one Tulu brahmin by name Divakara Muni, established this shrine on the 950th day of Kali Yuga. Leaving aside the legend part of it, when we come to history, Veera Marthanda Varma (1335-1384) appears to have had some control over this temple. In 1686 a devastating fire consumed the entire structure and in 1733 it was rebuilt in the Kerala style of temple architecture. Every year a ten-day festival is celebrated during September - October corresponding to the month of Thulam in Malayalam Calendar.

'Admission is Restricted to Persons who profess the Hindu Religion' - that is what their booklet says. I am first an Indian and my Hinduism is only a part of Indianness. The word 'India' has its origin in the river Sind and the derivative is 'Hind'. The word 'Hinduism' assumed importance only during the Moghul Period. In our scriptures and ancient literature, the scholars tell us, there was no mention of 'Hinduism'. Broadly speaking, 'Hinduism' means the Sanatana Dharma in the North and the Vedic Religion in the South. The very word 'Sanatana' has a different shade of meaning in the South Indian Languages - a maning



SWAMI VIVEKANANDA

akin to 'outmoded' and 'time-worn'.

Entry into the temple is restricted to the Hindus and the permitted dress for males is a dhoty and angavastram tied to the waist. Twelve years back I faced a similar predicament at Chidambaram when we were there with the Premchands. I was asked to remove my shirt and banian and enter the temple bare-chested. It was repugnant to my attitude and outlook and appeared more as a remnant of tribalism. That great publisher Vavilla Ramaswamy Sastrulu never wore a shirt, as shirts were not in vogue at that time. When he became sufficiently rich, he could only spread a woollen shawl on his shoulders, instead of the cotton upper - cloth.

"I would rather sit in the vehicle than enter the temple bare-chested as that hurts my sensitiveness," I said. To me all temples are artistic monuments of *Sadgunopasana*. Whether Shaivite or Vaishnavite or Shakteya, each temple has evolved its own legend tracing it back to bygone ages and every temple has its own hoary tradition. The three of them went in and returned after forty minutes. All the while I was listening to the pathetic tale of an unemployed graduate and I felt elated when he accepted the ten - rupee note I gave him. I was afraid he might refuse, as the offer might hurt his feelings. His acceptance filled me with a sense of fulfilment.

"The architecture inside is simply marvellous," noted Radha.

"At Chidambaram also, he didn't come in" said Malati.

"I stick to my principle and I do not like the idea of going to a place of worship bare-chested and in perpetuating this time-worn custom. I find a certain vested interest of a particular set trying to preserve its dominance and supremacy," I commented.

"He* has the courage of conviction," complimented Siva Swamy, as I blushed.

At the railway canteen we enjoyed our dinner and the next morning we were to visit the Napier Musuem in the Public Garden and Sri Chitra Art Gallery with its rare collection of Roerich landscapes and other outstanding paintings, besides Ravi Varma's.

We retired by nine - thirty to wake up by five with the humming of birds. From the hotel window we could watch the city slowly waking up from its slumber.

*Sunday - July 31, 1988*

It is said that 'the innumerable gods of the Hindu pantheon had waited nebulously for ages until Ravi Varma arrived to give them faces and figures of impeccable grace and beauty'. In 1871, Lord Napier, the Governor of Madras, observed in his talk to a cultural society that the Indian Mythology provided unrivalled opportunities for artistic description. Ravi Varma, living in far off Trivandrum and completely ignorant of the English language, never heard of Lord Napier or his prophetic words. Ravi Varma was taught only Malayalam and Sanskrit and the Ruler of Travancore allowed him to stay in his court. Theodere Jensen, a portrait painter of Dutch origin, came to Travancore with a commendation letter from the Viceroy of India, in 1868. He took Ravi Varma as his student but never taught him the secret of mixing colours. At last it was Kerala Varma who presented the young genius with a box of oil colours and that was a turning point in Ravi Varma's career. For nine years he struggled hard in self - instruction, as jealousy was rampant and nobody wanted this young man to come up. Those were days of royal patronage and the ruling princes of the small and big states wanted their portraits to be painted and as the popularity grew, Ravi Varma was given assignments by the Rulers of Travancore, Mysore, Baroda, Hyderabad etc.

In 1875, to a Fine Arts Exhibition at Madras, patronised by the Governor, Ravi Varma submitted two entries and his *Nair Lady* got the first prize and the Governor's Gold Medal. From that day onwards there was no looking back - it was a story of continuing success. Though taught only Malayalam and Sanskrit as a boy, Ravi Varma in later years learnt English, Tamil, Hindustani, Gujarati, Marathi and German and he could converse fluently in those languages.

"It is rare to come across in these days men like him, artists like him, lovers of India like him." said Abanindranath Tagore of Ravi Varma who passed away on October 2, 1906. Ravi Varma's

*Sakuntala, Sita Swayamavaram, Jatayu Vadha, Bhishma Pratijna, Krishna Rayabaram, Sita Bhoopravesam, Nala Damayanti, Viswamitra and Menaka, Harischandra and Taramati, Keechaka and Sairandhri, Gangavataranam, Siva Parvati* - the list is unending.

When we come to Sri Chitra Art Gallery what impresses us most is not Ravi Varma's pictures, as we are quite familiar with them but the Roerich landscapes and the Rajput, Mughal and Tanjore schools of painting. While Nicholas Roerich takes us to the charms of Himalayan heights and shows and ever-changing colours, Svestislov Roerich shows us the fury of *Storm,* widening experience of *Journey*, burdens of a *Messenger*, etc. While Pramod Kumar Chatterji's *Sunrise* opens up a spectacle of varying hues, Devi Prasad Roy Chowdary's *Homeward Bound* touches the strings of your heart. Govardhan Joshi's *Evening Glow* looks like a poem in colour.

Those were just a few but the couple of hours spent in the art-gallery was an aesthetic experience beyond words. This journey and this unforgettable experience were made possible by Radha Rani and Siva Swamy to whom we are indebted with a sense of gratefulness and a feeling of deep love and affection. True it was a shared joy but we had the maximum of it.

Soon after lunch we proceeded to Kovalam - a distance of just 14 km. Kovalam is one of the finest beaches in the world, with a beautiful curve of golden sands and coconut palms of green leaves dancing to the slow sea-breeze. It is a sheltered beach with excellent facilities and a health centre of ayurvedic treatment and healing touch of oil massage. Luxury hotels of Western and Indian style are there and we booked our rooms at Hotel Samudram. With artistic furniture and modern facilities our rooms were side by side and the wonderful sit-out (small balcony to each room) was an added attraction. From the sit-out, the sea is visible, not with a roar but sweet lullaby.

While the three of them preferred climbing a hillock I opted to watching the waves and talking to strangers, if they chose to converse. The music of the waves has a peculiar effect on our blood - stream and its rhythm is akin to our heart-beat. T'

learned ones explain it in so many words while the ordinary men and women enjoy it in mute joy. When you read a Joseph Conrad or a Stephen Crane, you wonder what a thrill and a pull the sea has in preference to roaming over the land. Wanderlust is nothing compared to the mighty attraction of the sea, as many who experienced it tell us. The man in the aeroplane feels safe and secure when he touches the ground but not with the man on high seas - to him land is only a stop-over. The fact that the sea covers three-fourths of the globe, perhaps has its impact on our thinking and feeling.

While Swinburne says:

"I will go back to the great sweet mother.

- Mother and lover of men, the sea.

- I will go to her, I and none other.

- Close with her, kiss her, and mix her, with me,"

Byron tells us:

"Roll on, thou deep and dark blue ocean, roll

Ten thousand fleets sweep over thee in vain,

Man marks the earth with ruin, his control

Stops with the shore..."

In silence we learn the lessons of wisdom from those blue waters. The sea has a perpetual desire to embrace this land and the land like a smart coy maiden has been repelling those advances since aeons of time.

Radha, Siva Swamy and Malati came down from the hillock, complaining tiresomeness and anxiously looking for tender coconut water. Some vendor suddenly appeared with coconuts and straws. After strolling on the beach for about half-an-hour, we got back to our rooms, had a refreshing bath and went to the dining hall.

That night with chairs drawn into the balcony (sit-out) we watched the moonlight, spreading over the golden sands, blue waters, green leaves of the coconut palms, distant cottages in brown - it was all a feast of colour to the eye and a tonic to the mind. No need to exchange ideas, no need to disturb the silvery silence with silly words, no need to speak of anything under the sun with moonshine showering happiness and bliss with a taste of elixir.

At twelve Malati felt sleepy and went in. I watched

the idyllic beauty of nature in its rhapsody till about two.

Next morning at the breakfast table Radha asked :

"Till what time were you awake ?"

"I couldn't control my sleep after twelve," admitted Malati.

"I was awake till twelve - fortyfive," pronounced Siva Swamy.

"Two," I said meekly.

"I went to bed after three," said Radha, scoring over us all.

**— NR Chendur**

*(to be continued*



అభిప్రాయ భేదాల్లాటివి గుర్రప్పందాలు.

కాబేజి, కాలేజి చదువు నేర్చుకుంటే, కాలీఫ్లవర్ అవుతుంది.

గొప్ప గ్రంథమంటే ప్రతిఒక్కరూ చదవాలనుకుంటూనే చదవనిది.

అనుభవం, అదర్శం, ఆశయబలం అవన్నీ అతనినంత చక్కటి అబద్ధాల కోరుని చేయగలుగుతున్నాయి.

శరీరశ్రమతో కూడినప్పుడే 'పని' అవుతుంది ; లేకపోతే 'పని' అనిపించుకోదు - వినోదం.

—మార్క్‌ట్వేన్




# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16-50 |
| కాంచన మృగం | 16-50 |
| భూమి పుత్రి | 16-00 |
| మధుర స్మృతులు | 14-00 |
| ఓ మనిషి కథ | 16-00 |
| ఏమిటీ జీవితాలు | 12-00 |
| మనసులోని మనసు | 25-00 |
| ఆలోచించు | 9-00 |
| రాగరక్తిమ | 18-00 |
| మేఘాల మేలిముసుగు | 16-00 |
| కలల వెలుగు | 15-00 |
| బ్రతకనేర్చిన జాణ | 14-00 |
| జయలక్ష్మి | 20-00 |
| కృష్ణవేణి | 20-00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15-00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18-00 |
| సద్యోగం | 15-00 |
| లావణ్య | 14-00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 40-00 |
| ప్రశ్నలు – జవాబులు | 15-00 |
| జాబులు – జవాబులు | 13-00 |
| అల్లికలు – కుట్లు | 30-00 |
| అందాలు – అలంకారాలు | 15-00 |
| మహిళలకు మధురజీవనం | 7-50 |
| దాంపత్య జీవితం | 12-50 |

# క్వాలిటీ పబ్లిషర్స్

విజయవాడ - 2

# కొత్త పుస్తకాలు

అరవై వసంతాల శార్వరి. సంపాదకుడు ! వాసిలి వసంతకుమార్ ప్రచురణ : యోగా స్కూల్, 1-1-694/2/A గాంధీనగర్, హైదరాబాదు - 380.... వెల : రు 30-00.

"తనకు విషయం తెలిసిన వాడెప్పుడూ మనకు తెలిసేటట్లు చెబుతాడు. తేలిగ్గా రాయడం ఎవరికి చేతనవుతుందంటే, విషయాన్ని తేలిగ్గా అర్థం చేసుకున్న వాడికి" అని అభ్యుదయ కవి శార్వరిని మెచ్చుకుంటారు నారాయణరెడ్డి. యోగ మార్గదర్శిగా, అధ్యాపకునిగా, కథా రచయితగా, నాటక కర్తగా, నవలారచయితగా, పత్రికా సంపాదకునిగా, కవిగా, తాత్త్వికునిగా, ఆదర్శమూర్తిగా నలభైమంది రచయితలు, శార్వరిలోని బహుముఖ ప్రజ్ఞా విశేషాలను ప్రశంసిస్తారు ఈ పుస్తకంలో. కొందరు శార్వరిని మహర్షి అనీ, పూర్ణయోగి అనీ అన్నారు. 'అక్షరయోగి' అని హితశ్రీ చెప్పగా, శర్మను శార్వరిగా చేసినది నేనే - అన్నారు భరద్వాజ. మధురాంతకం రాజారాం శార్వరి 'కథా వస్తువులు' గురించి ప్రస్తావించారు 'నవ్య భవ్యయోగి' అన్నారు వేటూరి ఆనందమూర్తి.... అరవై వసంతాలు నిండిన శార్వరి జీవితమూ, సాహిత్యమూ, యోగసాధన, తెలిపే గ్రంథమిది.

✠ ✠ ✠

'సూక్తులు - హితోక్తులు' - సంకలనం : కప్పగంతుల మురళీకృష్ణ. ప్రచురణ : క్వాలిటీ పబ్లిషర్స్, రామమందిరం వీధి, విజయవాడ - 2.... వెల : రు 25-00.

ఆధ్యాత్మిక మిత్రులు మాజేటి రామచంద్రరావుగారికి అంకితమిచ్చిన ఈ పుస్తకంలో, పదిహేను వందలకు పైగా సూక్తులను, జగత్ సత్యాలనదగు హితోక్తులను, సర్వకాలాలకు పనికొచ్చే భావస్ఫోరక విజ్ఞాన వివేక గుళికలను, అకారాది క్రమంలో సమర్పిస్తున్నారు కప్పగంతుల మురళీకృష్ణ. నవలమాదిరి, కథల మాదిరి ఒక్క బిగిని చదవకూడదు. రోజుకో పదిహేనో, ఇరవయ్యో చదివి, ఆత్మావలోకనం చేసుకు, అందులోని సారం వొంటబట్టించుకోవాలి. విల్ డూరాంట్ చెప్పినట్లు, విభిన్న మనస్తత్వాల వారిని, భిన్నాభిన్న రీతులలో ప్రభావితం చేయగల శక్తి కలిగినవే సూక్తులు. ప్రతి సూక్తీ ఒక

పరమ సత్యానికి ప్రతీక. కొన్ని వెంటనే మనసున నాటుకుంటాయి ; మరికొన్ని, నెమ్మది మీద అవగత మవుతాయి. లౌకిక ప్రపంచానికి సంబంధించినవి, నిత్య జీవితానికి సన్నిహితంగా ఉన్నట్లనిపిస్తాయి. అదే, తాత్త్వికమూ పారమార్థికమూ అయితే, కాస్త ఆలోచింప జేస్తాయి. మచ్చుకి కొన్ని ;

ద్రౌపదితో వ్యాసుడు మహాభారతం లో 'అమ్మా, పండితుని కనవద్దు, శూరుని కనవద్దు, అదృష్టవంతుని కనుము' - అంటాడట.... అహింస బలవత్తరమైన ఆటుపోట్లను సహించేది, అనురాగాన్ని మమతను పెంచేది (గాంధీ) ; ఇతరులు మనం చెప్పినట్లు చేయాలి అని ప్రయత్నించ డమే, మనం చేసే మొదటి తప్పు (శిశిరో) ; ఎవడైతే ఇతరులకు హాని చేయదలుస్తాడో, వాడు తనకు హాని చేసుకొనే వాడే (హజ్రత్ అలీ) ; కృష్ణ భగవానుని నిర్యాణం క్రీ.పూ. 17-2-3102 అని విద్వాంసులు తేల్చారు; జీవితంలో తప్పులు పట్టడం అంటూ ప్రారంభిస్తే, స్నేహితులు బంధువులు ఎవ్వరూ మిగలరు (అవ్వ యార్) ; నిగ్రహం కోసమే విగ్రహం, విగ్రహారాధన (జిల్లెళ్లమూడి అమ్మ) ; విశ్వాసం చాలామంది మనుష్యులలో ఉండని గుణం, అది జంతువులలో కనబడే సద్గుణం [రుక్మిణీ అరండేల్] ; సామాన్యుడు మోసం చేస్తే నేరం, ప్రభుత్వం మోసం చేస్తే రాజకీయం (దేవులపల్లి కృష్ణశాస్త్రి) ; లోకతత్వం తో ప్రపంచ జ్ఞానాన్ని తెలిపేవే శతకాలు.... మంచి విద్య నిజమైన ధనం, ఈనాడు నేర్పేదంతా అక్ష రాస్యత తప్ప విద్య కాదు (మురళీ కృష్ణ) ; నువ్వు స్వీకరించే ఆనందం కన్నా, ఒకరికి ఆనందం పంచడంవల్ల మరింత ఆనందం లభిస్తుంది (శ్రీమాత) ; నియంతలు నాశనం అవు తారు, ప్రజలనుండి గుంజుకున్న అధికారం మళ్లీ ప్రజలకే వస్తుంది, త్యాగధనుల ఆత్మార్పణలు వృధాకావు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఎప్పటికీ వృధాకావు (చార్లీ చాప్లిన్ ); మిమ్మల్ని మీరు అసూయ నుండి రక్షించుకోండి, లేకుంటే అది మిమ్మల్ని దహించి వేస్తుంది (మహమ్మద్ ప్రవక్త).

ఇటువంటి పుస్తకాలు యింగ్లీషులో అనేకం వున్నాయిగాని తెలుగులో చాలా అరుదు. మాకు తెలిసినంతలో యిదే మొదటిది. సంకలన కర్త కప్ప గంతుల మురళీకృష్ణ అభినందనీయ మగు కృషి చేశారు. అప్పుడప్పుడు అక్కడక్కడ చదువుకొనేందుకు ప్రతి యింట్లోను ఉండాల్సిన మంచి పుస్తకం.

—క్షీరసాగరమ్

✠ ✠ ✠

శ్వేత కపోతం - కవితా సంపుటి రచన ; తాళ్లూరి ఆంజనేయులు. ప్రచురణ : తాళ్లూరి రాకేష్, తిమ్మ సముద్రం - 523 185, ప్రకాశం జిల్లా.... వెల : రు 10-00.

కవిగారి బాల్యమిత్రులు డా॥ దగ్గు పాటి వెంటేశ్వరరావుకి అంకితమిచ్చిన ఈ పుస్తకానికి అభిప్రాయం వ్రాస్తూ,

'శ్రీ అంజనేయులు జీవిత రహస్యాలను దర్శించినవాడు, పిడుగులాంటివాక్కు ఉన్నవాడు, వర్తమాన జనబాహుళ్యాన్ని కాన్వాసుగా తీసుకు చైతన్య రేఖలుగీస్తున్న వజ్రధారి' - అన్నారు శేషేంద్ర.... 'ఈ రోజుల్లో వెలువడుతున్న కవిత్వంలో అధిక భాగం సమాజచేతనను కేతనంగా ధరించి సాగిపోయేవే.... ఇంతకు ముందున్న ప్రముఖ కవుల ప్రభావాలూ వున్నాయి. కొత్త గొంతుల కత్తి మెరుపులూ వున్నాయి' - అన్నారు నారాయణరెడ్డి.

'నిద్రిస్తున్న సింహాన్ని కొరడాతో ఝళిపించాలనీ, ఒక్క కలంపోటుతో లోకాన్ని శాసించాలనీ, పేట్రేగిపోతున్న న్యూక్లియర్ బాంబుల్ని నిముషంలో నిర్వీర్యం చెయ్యాలనీ' ఉన్నదట.... 'రక్తం ధారపోసి కట్లు తెంచారు ఆనాడు - రక్తం త్రాగమరిగి కోట్లు పెంచారు ఈనాడు' .... సమత్వం సాధించాలనే తపనతో, ఆశతో, ఆకాంక్షతో హలం పట్టిన చేతితోనే కలం పట్టాడు మా తాళూరి ఆంజనేయులు - అంటున్నారు నాగభైరవ కోటీశ్వరరావు. ఇండియన్ అంటార్కిటికాలో మన లైఫ్ ఒక ఎక్స్‌పెడిషన్ అని హెచ్చరిస్తున్నారు ఈ కవి.

—సుమతీ సాగర్

## ఈ మధ్య అందినవి

నవస్వరాలు - కవితా సంకలనం. గౌతమీ నవ్యసాహితి, చర్ల - 507 133... రు 15-00.

యోగమార్గం - యోగ విజ్ఞాన పత్రిక. గౌ॥ సంపాదకులు : శార్వరి : యోగాస్కూల్, హైదరాబాదు -380 .... కాపీ : రు 10-00 : సం॥ చందా : రు 40-00.

మన వివాహ వ్యవస్థ - నోరి శ్రీనాథ వెంకట సోమయాజులు రామకృష్ణ పబ్లికేషన్స్, మద్రాసు. - 17.... రు 25-00.

ఇంద్రాణీ సప్త శతీ కావ్య కంఠ శ్రీ వాసిష్ఠ గణపతి ముని. శ్రీ రమణ సత్సంగం, 14/9, కమలాపురం, అనంతపురం - 1.... రు 20-00.

అరుణాచల రమణుడు. మూలం : టియంపి మహదేవన్. అనువాదం : యంఆర్ నాగేశ్వరరావు. శ్రీ రమణ సత్సంగం, అనంతపురం - 1.... రు 3-00.

అచల రమణుడు - రావినూతల శ్రీరాములు, తాడిపత్రి - 1.... రు 3-00.

రమణీయం - సుంకర రమణి, విశాఖపట్నం - 17.... రు 5-00.

అందుకున్నవన్నీ గాకపోయినా, కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.



ఈ రోజులలో డబ్బు మాట్లాడటం లేదు - మాటా పలుకూచేకుండా వెళ్లిపోతున్నది. —రెడివింగ్స్

అభూత కల్పనలు సృష్టించుకు ఆనందించడంలో మానవజాతి గల ఆసక్తి అనూహ్యామైనది.

—సోమర్సెట్ మామ్

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కె యన్ కేసరి



ఒక మహానగరానికి పేదరికంతో వచ్చిన బాలుడు, తన జీవిత పథం తెలుసుకు, ఆ పేదరికం జయించి, సంపన్నుడై, సమర్థుడై, సర్వతోముఖ వికాసవంతుడై, సచ్చరితునిగా, సన్మార్గ వర్తునిగా సాహితీ ప్రియునిగా వినుతి కెక్కి, దిక్సూచి వలె దారి చూప గల మహోన్నతుడవటమే, 'చిన్న నాటి ముచ్చట్లు' ఈ తరానికి చెబు తున్నాయి. ఒక మహాపురుషుని జీవిత గాధను నేటి పాఠకులకు చేర్చుగా తెచ్చిన ఈ చిన్న పత్రికపై ఎందరెందరో అభినందనలు కురిపిస్తున్నారు వారందరికీ మా కృతజ్ఞతా సూచక వందనములు.... జులై 1989 నుంచి ఈ ముచ్చట్లు ధారావాహికంగా వెలువడుతున్నాయి.



# కూచిపూడి భాగవతుల వీధి నాటకములు

ఈ నాటక సమాజమునకు చెందినవారందరును కూచిపూడి వాస్తవ్యులగు బ్రాహ్మణులు. ఆడవేషమునుగూడ మగవారే ధరింపుదురు. వీరు రంగ స్థళమునకు వచ్చినపుడు పురుషుడువేసిన స్త్రీ వేషమును గుర్తించుట సులభముగ నుండెడిది. వీరి రేటుగూడ అంత జాస్తిగా నుండేదికాదు. వీరు బ్రాహ్మణులు గనుక భోజనాదివసతులు సులభంగా వూరిలో కుదిరేవి. వీరు మధ్యాహ్నపు వేళలో యెవరి యింటిలోనైన వేషములు వేయకుండ, అష్టపదులు, కృష్ణకర్ణా మృతములోని శ్లోకములు, తరంగములు పాడి, అబినయము పట్టి భరతశాస్త్ర ప్రదర్శన మొనర్చెడివారు. మరియు పండిత పామర రంజకముగా జాతీయములు చెప్పుదురు. జాతీయములనగా హాస్య ప్రసంగములు. ముసలి మగడు - పడుచు భార్య, ఛాందస గురుశిష్యులు, ఇత్యాదుల సంభాషణములను - ఒక్కరే రెండు గొంతులతో ఆయారసము ఉట్టిపడచెప్పి సభాసదులను కడు పుబ్బ నవ్వించేవారు. వీరిలో కొందరు గారడి కూడ చేయగలవారుండిరి. వీరు తరంగములు పాడునప్పుడు అద్భుతముగ నృత్యము చేసెడివారు. పళ్లెములో నీళ్లు పోసియుంచి ఒక్క చుక్క నీరైనా చిందకుండ దానియంచుపై నిల్చి నృత్యము చేయుచు గంటలకొలది 'బాలగోపాలమాముద్ధరే' అనే తరంగమును పాడగల నేర్పరులుండిరి. ఈ తరంగమున శ్రీ నారాయణ తీర్థులవారు తాళప్రస్థారమునకు ఎంతో అవకాశము కల్పించి వ్రాసియున్నారు. ఆ కళా సంతతివారు చాలమంది ఇప్పుడులేరు ; ఉన్న కొద్దిమంది సినిమాలలో చేరి ప్రాచీనకళను మరిచిపోవుచున్నారు ; చాలవేలవమైన నర్తన పద్ధతుల ననుకరింపబోయి వికృత మొనర్చుచున్నారు. సినిమాలున్నూ, రేడియోయున్నూ ప్రాచీనమగు భరతశాస్త్రమును, సంగీతకళను ధ్వంసమొనర్చు చున్నవని శ్రీ జయకర్‌గారివంటి పండితోత్తములే గోలబెట్టుచున్నారు.

కూచిపూడివారి పలుకు స్ఫుటముగను, ఉచ్చారణ స్వచ్ఛముగను ఉండును. వీరి హాస్యమును మోటు గాక సరసముగనుండును. వీరికి భాగవతమే విశేషముగ అభిమాన పాత్రమగు నాటకము. అందు శ్రీ కృష్ణ జనన ఘట్టములో 'దాదిని మంచము' - (బాలింతరాలి మంచము) అని వీరు ప్రవేశపెట్టుచుండిన యొక విశేషము నాకిప్పటికిని జ్ఞాపకమే. వెదురుబద్దలతో మంచము, లేసుగా తయారుచేయుదురు. అందు బాలింత శిశువుతో కూడ పడుకున్నట్లు అమర్చుదురు. నడుముకట్టు మున్నగు వానితో శృంగారింప బడినబాలింత మంచముపై పరున్నట్లెయుండి - మంచము క్రిందికి కాళ్లు దిగ

విడుచును. అట్లేయుండి ఆమె నడుచుచు పాడుచుండును. మంచమును ఆమెతో కదలి నడుచుచు చూపరుల కాశ్చర్యము గొల్పును.

## చెంచు నాటకములు

ఆ కాలమున చెంచునాటకములను గొల్లవారు చేరి ప్రదర్శించుచుండిరి. వీరి నాటకములు పల్లెటూళ్లలో చాల పేరుపొంది యుండినవి. ఒక ఊరిలో వీరు చాలదినములు బసచేసి నాటకము లాడుచుండేవారు. వీరి నాటకములో ముఖ్యమగు ఇతివృత్తము అహోబిల నారసింహస్వామి చెంచెతను (చెంచువారి పడుచును) మోహించి వివాహమాడుట. ఈ అహోబిలక్షేత్రము కర్నూలు జిల్లాలో చెంచువాండ్రు నివసించు అడవి మధ్య నొక కొండ యందున్నది. ఆ స్వామి యుత్సవ సమయమున చెంచుపడుచులు విల్లంబులు చేతబట్టి చురుకు తనముతో యాత్రికులమధ్య స్వేచ్ఛగా చకచక తిరుగుచుందురట. వారి స్వేచ్ఛా స్వాతంత్ర్యములజూచి అది స్వైరిణీ స్వభావముగా తలంచి ఎవ్వడైన పొరబడెనా వానిని గట్టిగా చెంపవాయగొట్టుదురట. ఆ చెంచెత కధనే 'గరుడాచల మహాత్మ్యము' అని పూర్వకవి యక్షగానముగా వ్రాసియున్నాడు. దాని ననుసరించి ఈ నాటకమును వీరాడుదురు. వీనిలోని పాటలు వూరి వారందరు పాడుచుందురు. గొడ్లకాచుకొను పిల్లకాయలు ముఖ్యముగా వీనిని విడువక పాడుచు పొలములలో చెట్లక్రింద ఆడుచుందురు. ఈ పాటబాణి అందరికి అందుబాటులో యుండును. అందరి నోళ్లలోను నానే చరణము :-

'నన్ను పెండ్లాడవే చెంచీత''

## తోలుబొమ్మలాట

మా వూరి రంగిరీజులు గుడ్డలమీద బొమ్మలను వేసి అద్దుటకు అల వాటుపడిన వారు గనుక పలచని తోళ్లను బొమ్మలవలె కత్తిరించి వాటికి రంగు లనువేసి వాని సహాయమున నాటకములాడుచుండిరి. ముఖ్యముగ నేను జూచిన నాటకము రామాయణము. ఈ రామాయణ నాటకములోని దశ కంఠుడు, ఆంజనేయుడు, సీత మొదలగు వారి చిత్రములతోకూడ వానర రాక్షస సేనలుండినవి. ఈ బొమ్మలకు చేతులు కాళ్లు తల మున్నగు అవయవములన్నియు విడివిడిగనే చేయబడి - దారములతో కట్టబడి యుండును. బొమ్మలకు వెనుకప్రక్క అన్నిటికి కలిసివచ్చునట్లు వెదురు బద్దలను కట్టుదురు. ఆ బద్దలకు దారము లమెర్చెదరు. ఈ సూత్రములను (దారములను)

అన్నిటిని కథ నడుపువారు పదిౘ్రేళ్లకు తగిలించుకొని చేతబట్టుకొని లోతెరలో తెరపై బొమ్మలనుంచి నిల్తురు. పిదప కథాను సరణముగ ఆయాసూత్రములు లాగుచు ఆ బొమ్మల అవయాంగముల నాడింతురు. తెరలో దీపములుండును. ఇవతలయుండవు. తెరలోని వెలుతురువల్ల - ఆ రంగుబొమ్మలు తెరపై ముందుభాగమున పెద్దవిగా ప్రతిఫలించుచు నిజమగు వేషధారు లాడు చున్నట్లుండును. తెరవెనుక నున్న వారు ఆయా కథ పట్టులు - వచనమున, పద్యముల, పాటల పల్కుచుందురు. అందుచే ఆయా పాత్రలే ఆడుచు పాడుచున్నట్లుండును. బహుశా ఇది భారతీయ నాటకమునకు ఆదియేమోనని నా అభిప్రాయము. ఏమంటె సంస్కృత నాటకముల నాటకమాడించు ప్రధాన పురుషుని 'సూత్రధారి' అందురు. నిజమున కతడు ధరించు సూత్రమేమియు లేదు. తోలుబొమ్మలాటలలోని సూత్రములే - ఈ సూత్రధారికి మూలమేమో? ఈ 'సూత్రధారి' హస్తలాఘవమున రామరావణ యుద్ధమును, సముద్ర లంఘనమును, లంకాదహనమును, వానరరాక్షస సమరమును, రథములను మొదలైన వాని నన్నిటి సందర్భాను సారముగ పాటలతో, మాటలతో, శబ్దములతో, రోదనములతో చిత్రవిచిత్రముగ దృశ్యములుగా చూపగల్గును.

అసలీ తోలుబొమ్మలాటకు మరాటీవారు ప్రసిద్ధి. వారిలో చాలమంది పెద్ద విద్వాంసులు కాకపోయినను - గురుముఖతః విద్వత్తుతోకూడిన నాటక మును వల్లించి, కథ నడుపుట నేర్తురు. వీరు కథ నడుపునప్పుడు - సంస్కృత సమాసములను, వాక్యములనుచెప్పి - ముక్కముక్కగా విరిచి అర్థము చెప్పు దురు. "అశ్వ - గుర్రములున్నూ, గజ - ఏనుగులున్నూ ...." ఈ విధముగా చెప్పుచుందురు. మరియు నప్పుడప్పుడు అమరమందలి శ్లోకములును చదువు దురు. మా ఊరు అద్దంకిసీమలోనిది. అద్దంకిసీమను కొన్నాళ్లు మారాఠీ లేలినారు. నేటికిని వంగవోలులో మరాటీపాలెమున్నది. బహుశా ఆ ఆ సంపర్కముచే మా ఊరి రంగిరీజుల కిది అబ్బియుండును.

సినిమాలు సైన్సుసహాయమున మొదట ఏర్పడినప్పుడు బొమ్మలు కదిలేవే గాని మాట్లాడేవికావు ; ఇప్పుడు మాట్లాడుచున్నవికూడ. కాని మనప్రాచీనులీ అవకాశములను పూర్వమే ఊహించి, వారికి వశమైనంతవరకు ఈ విధముగా అమలుజరిపిరి కాబోలు !

# 22 నాగరికపు నాటకములు

## ధార్వాడ కంపెనీ నాటకములు

అంతకు పూర్వము వివరించిన వీధిభాగవతములువెలసి యున్న మన ఆంధ్రదేశమునకు 1890 ప్రాంతములో ధార్వాడ నాటక కంపెనీయని ఉత్తరదేశమునుండి వచ్చి పలుతావుల నాటకములువేసి ప్రజాభిమానమును సంపాదించిరి. వీరు చాల పాతపద్ధతుల నన్నింటిని మార్చి రంగస్థళమునకును, వేషభాషలకును, వివిధములగు మెరుగులను దెచ్చిరి. రంగస్థళమున ఆయా నాటకములందలి కథపట్టులకు తగిన రంగుతెరలను (కర్టన్స్) కట్టుచుండిరి. ఆముదపుదివిటీలకు బదులు రంగు మత్తాపులను వెలిగించుచుండిరి. కొయ్యతో చేసిన కాకిబంగారపు నగలకు బదులు గిల్టుసొమ్ములను ధరించుచుండిరి. మంచిఉడుపులను ధరించుచుండిరి. నటన నృత్యాదికములైన నూతనదృశ్యము లను సొంపుగ చూపించుచుండిరి. ఈ నాటకములు ఆంధ్రదేశమున జనులకు ఆకర్షణీయముగ నుండెను. వీరి ఇంద్రసభను జనులు చాలా మెచ్చుకొనుచుండిరి. అయితే వీరిభాష (హిందీ) వేరుగ నుండెను. మొత్తమునకీ నాటకములవల్ల మన తెలుగుదేశమున నాటకకళ క్రొత్తమార్గము పట్టినది.

## పార్సీ నాటకములు

వీరి పిదప బొంబాయి ప్రాంతమునుండి పార్సీనాటక కంపెనీవారు మద్రాసుకు వచ్చి ఇప్పుడు బర్మాషెల్ కంపెనీవారి కట్టడముండు స్థళమున పెద్దకొటాయిని దిట్టముగ పలకలతోను ఇనుపరేకులతోను కట్టి రెండు మూడు మాసములు దినదినము నాటకములు వేసేవారు. వీరి రంగస్థళపు ఏర్పాట్లు చాల రమణీయముగను ఆకర్షణీయముగను ఉండెడివి. ముఖ్యముగ వర్షము కురియుట, తుపాను కొట్టుట, సముద్రము, ఇండ్లు కాలుట మొదలగువాటిని చూచినప్పుడు నిజముగ అవి జరుగుచున్నట్లే కాన్పించును. రంగస్థళముమీద వారు ధరించు ఉడుపులు దీపముల వెలుతురులో జనుల నానందాశ్చర్యముల ముంచి వైచెడివి. వారు చూపించు దర్బారు సీనులద్భుతముగ నుండెడివి. ఒక సీనునుండి యింకొక సీను మారుటకు సూచనగా ఒక తుపాకీ కాల్చెడు వారు; ఆ దెబ్బకు అదరి కనుమూసి కన్నుతెరచేటంతలో - ఒక్కనిమిషమున సీను మారిపోయెడిది. ఈ నాటకసమాజమున స్త్రీలు పురుషులు కలిసియుండే వారు. ఈ సమాజమువారు చెన్నపట్నము వచ్చినపిమ్మట, రంగస్థళమున ఇచ్చట నటకుల వేషభాషలు చాలవరకు మర్యాదమార్పులను చెందినవి.

నాటకములలో స్త్రీ పాత్రను స్త్రీయే ధరించుటకు కూడ ఈ నాటకసభయే చాల వరకు తోడ్పడినది. అటుపిమ్మట కూడ మరికొన్ని పార్శీనాటక సమాజముల వారును మద్రాసునకు వచ్చియుండిరి.

## బళ్లారి సరస వినోదినీ సభ

ఈసభకు మూలపురుషుడు శ్రీమాన్ ధర్మవరము రామకృష్ణమాచార్యులు. ఆంధ్రదేశమున స్వతంత్రముగ నాటకముల రచించి, తానును ప్రాత వహించుచు తగువారిని తర్ఫీదు గావించి నాటకములనాడు కంపెనీలను ప్రారంభించిన ప్రముఖులు ప్రథములు వీరే యనవచ్చును. ధార్వాడ పార్శీ నాటక కంపెనీలు మనదేశమునకు వచ్చి వెళ్లుటకు కొంచెము వెనుకముందుబుగా, వీధిభాగవతములు మరుగై, వచన నాటకములు వెలసినవి. 1884 లో గుంటూరునాటక సంఘమువారి వచననాటకము లాడుటలో ప్రసిద్ధులు అని తెలియుచున్నది. 1888 లో వీరిని చూచి మా వంగవోలు వారైన ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు రాజమహేంద్రవరమున ఏర్పరచిన హిందూ నాటక సమాజమువారు 1889 లో ఆడిన తోలేటి వెంకటసుబ్బారావుగారి 'హరిశ్చంద్రనాటకమున్నూ' చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి 'కీచకవధ' యున్నూ ఇట్టి వచననాటకములే. ఈ వచన నాటకములలో శ్రీ ప్రకాశం పంతులుగారు చిన్నతనములో చంద్రమతి, ద్రౌపతి పాత్రలు ధరించుచుండిరని విందుము. శ్రీ ఆచార్యులవారు ఆంగ్లవిద్యాభ్యాసమొనర్చిన పట్టభద్రులు, న్యాయవాదులునైయుండిరి. ఆంగ్ల నాటకముల సారమును, సంస్కృతనాటకముల పోబడులు నెరింగిన ప్రోఢలగుట తమ స్వతంత్రనాటకములలో నా యా ఛాయల చూపించిరి. ధార్వాడకంపెనీ పార్శీకంపెనీలవారి దరువులు, మెట్లు మున్నగునవి అప్పటికే ఆంధ్రదేశమందలి ప్రేక్షకుల నాకర్షించుచుండుటచే - వానికి సమమైన పాటలను తమనాటకముల చేర్చిరి. నాటకమున పాత్రధారణమును వృత్తిగాగాక వినోదముగా వహించు పెద్దమనుష్యులను చేరదీసి - నాటక సమాజమును నిర్మించిరి. వీరి మేనల్లుడే విఖ్యాతిచెందిన ' నాట్యకళాప్రపూర్ణ రాఘవాచారిగారు. కావున వీరికి 'ఆంధ్రనాటక పితామహ' యన్న బిరుదు అమరియున్నది. అయితే నా అభిప్రాయమున వీరు నటునికన్నా నాటక రచయితగానే ఎక్కువ ప్రసిద్ధులు. వీరి నాటకముల వలన తెలుగువారి నాటకరంగమున కొకతీరు ఏర్పడి రక్తికెక్కి శోభించినది. వీరి నాటకసమాజమువారు తరచుగ ఆరోజులలో చెన్నపురికి వచ్చి తమ నటనా కౌశలము చూపిరి. ఇచ్చట ధనవంతులగు వర్తకులు, ఉద్యోగస్థులు విస్తారముగా నీ నాటకములు చూచిరి. శ్రీ ఆచార్యులవారు 'చిత్రనళీయము' నందు బాహుక

పాత్రను ధరించి నటించుటను నేను చూచియున్నాను. అప్పటికే వారు వృద్ధులైయుండినందున రంగస్థళమున వారిపాత్ర అంతగా రాణించి యుండ లేదు. వారు వ్రాసిన నాటకములు పైకివచ్చినపిదప అంతకుపూర్వము నాటకములన్నియు మాయమైనవి.

ఈ బళ్లారిలోనే వకీలుగానుండిన శ్రీ కోలాచలం శ్రీనివాసరావు పంతులు గారు కూడ అకాలముననే కొన్నినాటకములు వ్రాసిరి. వీరికి నాటకలక్షణము బాగుగ తెలియును. ప్రపంచమందలి నాటకముల చరిత్ర చాలా తెలియును. వీరా విషయమునుగూర్చి యొకగొప్ప గ్రంథమును, అంగ్లభాషయందు వ్రాసియున్నారు. వీరువ్రాసిన నాటకములలో మేటి 'విజయనగర సామ్రాజ్య పతనము'. ఈ నాటకమందు పఠాన్‌రుస్తుం పాత్రధారిగా శ్రీ రాఘవాచారి గారి ఖ్యాతి ఆంధ్రులకు వేరుగా చెప్పనక్కరలేదు. 'లవకుశ' మున్నగు మరి కొన్నినాటకములనుకూడా వీరు రచియించియున్నారు. వీరును ఒక నాటక సమాజము నేర్పరచిరి. కాని అది ఆచార్ల వారి నాటకసమాజమంత ప్రసిద్ధి చెందలేదు. కొన్నాళ్లీ రెండుసమాజములకు బద్ధవైరముగాకూడ నుండెడిదట. శ్రీ రావుగారి కంపెనీ పేరు - "సుమనోరమసమాజము" అయియుండగా ప్రతికక్షులు దీనిని "సుమ్మనేరి సభ" అని హాస్యమాడేవారట. "సుమ్మనేరి" అంటే కన్నడములో మౌనము వహింపుము యని అర్థమట. ఆ కాలములో ఒకే ప్రదేశమునగల నాటక సమాజముల కిట్టివైరము సహజ లక్షణముగా నుండెడిది.

## సుగుణ విలాస సభ

బళ్లారి సరసవినోదనీ సభవారి నాటకములు ప్రజారంజకములగుటజూచి చెన్నపురియందలి విద్యావంతులకును ఉత్సాహము కలిగినది. ఆ ఉత్సాహ ఫలితమే సుగుణ విలాస సభ. ఇది 1891లో ఏర్పరుపబడినది. ప్రథమ మున దీనిలో చేరినది 7 గురుసభ్యులు. ఇది కొంతకాలమునకు విక్టోరియా పబ్లిక్‌హాలులో ఉంచబడి అందే అభివృద్ధి గాంచినది. పిదప మౌంటురోడ్డులో దీనికి స్వంత భవనమేర్పడినది. ఈసభలో తమిళులు ఆంధ్రులుకూడా కలిసి సభ్యులుగనుండిరి. నా చిన్నతనమున ఈసభలో సభ్యుడుగానుండుట గౌరవ చిహ్నముగా నుండెడిది. నేను కూడ ఈసభలో సభ్యుడనైతిని. ఈసభ వారు ప్రథమములో అంగ్లాంధ్ర ద్రావిడ సంస్కృత కనడభాషలలో నాటకము లాడుచుండిరి. తుదకు మిగిలినవి తెలుగు తమిళ టకశాఖలు మాత్రమే. ఈసభ నాటకము లాడుటకును, రుచిగల ఫలహారములకును పేరుపొంది యుండెను. ఈరెండును మెంబర్ల నాకర్షించుచుండెను. ఈ సభవారు

దసరాపండుగను అతివైభవముగ జరుపుచుండిరి. ఆ తొమ్మిదిరోజులు సభా భవనమున సభ్యులకు విందు జరుగుచుండెను. నాటకముల నాడుచుండిరి. ఇందనేక జనరంజకమగు కార్యములను వేయుచు సభ్యులను సంతోష పరచు చుండిరి. ఆంగ్లాంధ్ర ద్రావిడ పుస్తక భాండాగారములు కూడ ఈ సభ తరపున నేర్పడినవి. స్వంతభవనమునకు మారిన పిదప ముందువలె నాటకాదులను విశేషముగ జరుపుటలేదు. ఇప్పుడీ సభ ఎక్కడున్నదియు చాలమందికి తెలియదన్న అతిశయోక్తిగాదు.

ఈ సభకు మూలపురుషులు శ్రీమాన్ వి. వి. శ్రీనివాసయ్యంగారు. వీరిని సభ్యులందరును 'ముత్తన' అని పిలుచుచు పితృభక్తితో గౌరవించుచుండిరి. వీరు నాటకాలంకార శాస్త్రములందు మంచి పరిచయముగల కళావేత్తలు; రసజ్ఞులు. వీరు స్వయముగ కొన్ని సాంఘికనాటకములను వ్రాసి సభవారిచే ప్రదర్శింపించుచుండిరి. వీరు కొన్నాళ్లు మద్రాసు హైకోర్టుజడ్జీపదవి వహించి యుండిరి. ఆ రోజులలోను దీనిని చేయివిడువక నడిపించి వృద్ధికి తెచ్చిరి. నేడు వీరు వృద్ధులయ్యు న్యాయవాదివృత్తిని వదులుకొనలేదు. వీరిని దర్శించి నప్పుడు భీష్మాచార్యులు మనస్సునకు వచ్చుచుందురు.

ఈ నాటకసభకు సూత్రధారులు శ్రీ దివాన్ బహదూర్ సంబంధమొదలి యారుగారు. వీరు కొన్నాళ్లు ప్రెసిడెన్సీ మాజిస్ట్రేటు ఉద్యోగమునుగూడ నిర్వహించిరి. వీరు తమిళనాటకములను వ్రాసి సభ్యులచే నాడించుచుండిరి. స్వంతముగ వేషములనువేసి సభ్యులను సంతోషపెట్టుచుండిరి. వీరు షష్ఠిపూర్తి గడిచిన పిమ్మట కూడ ప్రహ్లాద నాటకములో బడిపిల్లవాని వేషమును ధరించి సభ్యులను నవ్వించుచుండిరి. వీరు అవేషమున "ఓ. న." అనే బీజాక్షరములు వీపున వ్రాయించుకొని నటించి నవ్వించుట నాకు ఇప్పటికిని జ్ఞాపకమున్నది. వీరును వృద్ధులై విశ్రాంతి తీసుకొనుచున్నారు.

ఈ సభకు అలంకారపురుషుడు గతించిన రంగవడివేలుగారు. వీరును న్యాయవాది వృత్తియందే యుండి అకాలమరణమునకు గురియైరి. వీరికి రంగస్థళమున ఆడవలయుననియు పాడవలయుననియు కడు కుతూహలముగా నుండెడిది. కాని పాపము వారు ఆడలేరు; పాడలేరు. అయితే కొన్ని రోజులు కష్టపడి నాట్యమును మాత్రము కొద్దిగ నేర్చుకొనిరి. మౌనమును ధరించి రంగస్థళమున నృత్యమును చేయుచుండిరి. వీరు రాణి వేషమును వేసినప్పుడెల్లను సంబంధ మొదలియారుగారు రాజువేషమును వేయుచుండిరి. వీరిరువురు మంచి చెలికాండ్రు.

(ఇంకా వుంది





## జూన్ 21, 1990

"డెబ్బయ్యేళ్లక్రితం స్కూలు వొదిలేశారు ; అరవైఏళ్లక్రితం సత్యాగ్రహం చేశారు ; ఏభైమూడేళ్లక్రితం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మంత్రి అయారు; ఆ తర్వాత ముఖ్యమంత్రి, కేంద్ర మంత్రి, గవర్నరు - యిలాటి ఉన్నత పదవులు చేబట్టారు ; పదిహేనేళ్ల క్రితం స్వీయకవిత ప్రారంభించారు. యువకవిగా ఆయన వయసు పదిహేనేళ్లు. నెహ్రూ శతజయంతి సంవత్సరంలో నెహ్రూ అడుగుజాడలలో నడిచిన బెజవాడ గోపాలరెడ్డిగారు, 1989 రాజాలక్ష్మి అవార్డు గ్రహీత ; ఆ అవార్డుకి అనుబంధమైన డాక్టర్స్ కెవి రావు జ్యోతిరావుల అవార్డు అందుకొనేందుకు, అమెరికా వెళ్తున్న సందర్భంగా, వారు సుఖంగా వెళ్లి సంతోషంగా రావాలని కోరుతూ ఈ చిన్న వీడ్కోలు సమావేశం ఏర్పాటు చేశాము" - అన్నారు 'రచన' కన్వీనర్ బియస్సార్ కృష్ణ. కళావాచస్పతి జగ్గయ్య, గోపాలరెడ్డి గారికి శుభాకాంక్షలు తెలిపిన మీదట, "భోగభూమి అయిన అమెరికా చూడటానికే తప్ప, అక్కడ వుండలేము. మన యోగభూమికి వచ్చేయాలనిపిస్తుంది. ఈ పదహారేళ్ల బాలా కుమారుడు క్షేమంగా వెళ్లిరావాలని ఆకాంక్షిస్తున్నాను" - అన్నారు పద్మభూషణ్ మోటూరి సత్యనారాయణ. నెల్లూరు మిత్రు లొకరు అదేవిధంగా శుభాకాంక్షలు తెలిపారు.... "మా నెల్లూరు జిల్లాలోని పులికాట్ సరస్సు మొనవి జనవరిలో చూశాను - దాని గురించి వినడమే తప్ప యిన్నాళ్లూ చూడలేక పోయాను. వెనకొకసారి పారిస్ వెళ్లాను గాని లండన్ చూడలేదు ; కెయిరో చూశాను, బెతల్‌హామ్ చూశాను. బయట దేశం వెళ్లబోయే ముందు, భారతావని లోని అన్ని రాష్ట్రాలూ సందర్శించి వుండాలనే అభిప్రాయంతో, ఏప్రిల్‌లో మిజోరామ్, నాగాలాండ్, మణిపూర్, త్రిపుర, అరుణాచల ప్రదేశ్‌లు చూశాను - 1800 కిలోమీటర్లు ఘాట్ రోడ్స్‌లో ప్రయాణం, శ్రమ అయినప్పటికీ శ్రమ అనిపించలేదు .... రంగూన్ నుంచి జపాన్‌వారు దాడి చేస్తున్న సందర్భంగా (రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో) ఆ 'నార్త్ - ఈస్ట్‌లో', ఇంఫాల్‌లో భారతదేశరక్షణ కోసం

ప్రాణాలర్పించిన బ్రిటిష్ సోల్జర్ల సమాధులున్న సిమెటరీ చూస్తూ వుంటే నా వొళ్లు జలదరించింది - ఎక్కడ నుంచి ఎక్కడ కొచ్చి అమరు లయారు ! .... పది రోజుల క్రితం రాజపాలెం వెళ్లినప్పుడు కృష్ణస్వామి భారతిని చూశాను ; వందేళ్ల నాటి వారి పురాతన గృహం కూడా చూశాను. భార్యా భర్త లిద్దరూ స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. తమిళనాడు మొత్తానికి 1937 నాటి యమ్మెల్యేలలో మిగిలినది ఆయన ఒక్కరేనట. కేరళలోను, కర్ణాటక లోను ఒక్కరు కూడా లేరు. ఇక, ఆంధ్రాలో మిగిలివున్నది అమ్మన రాజా, కొత్రగడ్డ నారాయణరావు, చంద్రమౌళి, నేనూను .... వేదాంతం కాదు గాని ఒక్కోసారి యిటువంటివి ఆత్మావలోకనం వైపు దారితీస్తాయి .... 1937 లో మొదటిసారిగా కాంగ్రెస్ పాలన ఏర్పడ్డప్పుడు, మంత్రి పదవులు నిర్వహించిన వారిలో ఈ నాడు సజీవులై వున్నది ముగ్గురే - విజయలక్ష్మీ పండిత్, మురార్జిదేశాయ్, గోపాలరెడ్డి .... ఈ శతాబ్దిలో అన్ని దశాబ్దులూ చూసిన అదృష్టం నాది .... నేనిప్పుడు అమెరికా వెళ్లటం, ఆ దేశం చూడాలనికాదు - రమణయ్యరాజాగారి పురస్కారం నాపై మోపిన బాధ్యతను నెరవేర్చు కొనేందుకు !




ఒక్కపలుకుచాలు పరిమళాలుచిలుకు

త్రివేణి

TRIVENI
SWEET SUPARI

తీపి వక్కపొడి

కోట్లాదిప్రజలు
మక్కువతో కోరుకొనేది

త్రివేణి నట్‌పౌడర్ మాన్యుఫ్యాక్చరింగ్ కో




అమెరికా వెళ్లి కెవి రావు - జ్యోతి రావుల అవార్డు అందుకోవడం కూడా ఆ పురస్కారంలో ఒక భాగం. ఆ బాధ్యతే నన్ను ఈ 83 ఏళ్ల వయసులో అమెరికా పంపుతోంది" - అన్నారు బెజవాడ గోపాలరెడ్డి గారు, - పొట్టి శ్రీరాములు హాలులో. వారి పెద్ద బ్బాయి కృష్ణమోహన్, తండ్రికి తోడుగా వెళ్తున్నారు. అగస్టు రెండోవారంలో అమెరికా నుంచి, మరికొంచెం మిసిమితో వచ్చే గోపాలరెడ్డిగారు, తమ పర్యట నానుభవాలు ఎప్పుడు చెబుతారా అని, కుతూహలంలో ఎదురు చూస్తున్నారు - ఈనాటి సమావేశానికి వచ్చిన వారందరూ!

. . . . . . 24

ఈ సాయంత్రం గోపాలరెడ్డిగారు, రాజాలక్ష్మి అవార్డులో ద్వితీయార్ధమైన, డాక్టర్స్ కెవి రావు జ్యోతిరావుల పురస్కారం అందుకునేందుకు అమెరికా వెళుతున్నారు. ఊళ్లో ఉన్నప్పుడు చెట్టినాడ్ పాలెస్‌కి వెళ్తూనో వస్తూనో మా యింట్లో పది నిముషాలపాటు కూచోడం, వారికీ మాకు అలవాటైపోయింది. నిన్న వచ్చినప్పుడు మాలతి అంది: 'రేపు సాయంత్రం ఏర్‌పోర్టుకి వస్తాం'.... 'ఎందుకమ్మా శ్రమ?' అన్నారాయన. ఇవ్వాళ ఉదయం ఆరుగురింటికి వెళ్దామనుకున్నారట ; అయిదు: మా యిల్లు; ఆరు : విజయారావు. అక్కడ నుంచి చెట్టినాడ్ హవుస్. పదినిముషాలు కూర్చున్నారు - ఆ ఉదయం ఎవరెవరింటికి వెళ్లినదీ చెప్పారు. శారద, మాలతి, నేనూ ముగ్గురం - ఆయనను క్షేమంగా వెళ్లి ఆరోగ్యవంతంగా, తిరిగి రమ్మని హృదయ స్పందనతో వీడ్కోలు చెప్పాం. ఆయనకు అమెరికా వెళ్లాలనే అభిలాష వుంది. వెళ్లిరావడం కర్తవ్యంగా భావిస్తున్నారే తప్ప, కొత్త దేశం చూడాలనీ కొత్త మనుషుల్ని కలుసుకోవాలనీ ఆ ఉత్సాహం కనిపించలేదు. ఏర్‌పోర్టుకి వెళ్లడం గురించి మాలతి మళ్లీ కదిపింది - ఆయన వొద్దన్నారు.... సాయంత్రం అయిదున్నరకి 'సర్ ప్రయిజింగ్' గా రమణయ్య రాజా, బియస్సార్ వచ్చి, 'గోపాలరెడ్డి గారికి సెండాఫ్ యిచ్చేందుకు వెళ్దాం, రండి' - అన్నారు. తను రానంది - బట్టలు మార్చుకు నేను బయలుదేరాను... మొదట చెట్టినాడ్ పాలెస్‌కి వెళ్లాం. రిపోర్టింగ్ టైము ఏడు కదా, అప్పుడే ఆరుంపావు అయింది, మేడ ఎక్కడ మెందుకని అనుకున్నాం. కాని, ఎక్కక తప్పలేదు. గోపాలరెడ్డిగారి చుట్టూ మాగుంట సుబ్బరామిరెడ్డితో కలిపి అయిదారుగురు వున్నారు. లక్నో కాపూ, క్లోజ్‌డ్ కోటూలో ఆయన ముమ్మూర్తులా కాంగ్రెస్ గవర్నరులా ఉన్నారు. "ఎవరైనా మిమ్మల్ని అడిగితే గవర్నరు గోపాలరెడ్డి అని చెప్పండిగాని, ఎక్స్ గవర్నరు అని అనకండి. 'మాజీ' శబ్దం అమెరికాలో లేదు. కార్టర్‌ని యిప్పటికీ ప్రెసిడెంట్ కార్టర్ అనే అంటారు" - అని సూచించారు బియస్సార్. ఇరవై నిముషాలు, పైన గడిపాక, నాలుగు కార్లలో ఏర్‌పోర్టుకి బయలుదేరాం.

గోపాలరెడ్డిగారు,మాగుంటవారి కారులో వచ్చారు. రాజాగారి కారులో నేనూ బియ స్సారూ. ఏర్‌పోర్టులో గోపాలరెడ్డిగారి భార్య, ఆయన తమ్ముడు, బావమరిది, బంధువర్గమూ ఎందరెందరో హితులు, సన్నిహితులు, మిత్రులు పూలమాలల తో పుష్పగుచ్ఛాలతో ఆయనకు వీడ్కోలు చెప్పారు.... ఎనిమిదిన్నరకి యింటికొచ్చాక మాలతి అంది : "అను కోకుండా రాజాగారు రావడం, గోపాల రెడ్డిగారు వద్దన్నప్పటికీ నువ్వు ఏర్ పోర్టుకి వెళ్లిరావటం, మనసుకెంతో తెరిపిగాను, తృప్తిగాను వుంది."

. . . . 29

కాలగతితో 'ఈటింగ్ హాబిట్స్' (తినే అలవాట్లు) మారిపోతు న్నాయి. 'అన్నపూర్ణకు నుద్దియౌనతని గృహిణి' అనేది ప్రబంధయుగం నాటి మాట. ఈనాడు భార్యభర్తలిద్దరూ అతిధులని ఆదరించడం యింట్లోకాదు, 'ఫలానా హొటల్‌కి వెళ్లాం' అంటు న్నారు. ఇళ్లు చిన్నవి, పనిమనుషులూ పాత్రలూ ఒక ప్రాబ్లమ్. ఇద్దరూ ఉద్యోగాలు చేసుకొనే వారయితే యింకా యిబ్బంది. అంచేత 'ఈ టింగ్ అవుట్' అనేది పెద్ద పట్నాలలో తరచు వినిపిస్తూంటుంది.... దయాకర్ దంపతులు, బెసెంట్‌నగర్ ఎలియట్స్ బీచిలో (34), నవజీవన సరళికి అను గుణంగా 'బీచ్ కాజిల్' (Beach Castle) అనే 'రెస్టారె' (ఉపాహారశాల) తెరిచారు. శ్యామసుందరరెడ్డి రిబ్బన్ కట్ చేయగా, రామరాఘవరెడ్డి 'ఫాస్ట్‌ఫుడ్ కౌంటర్' వోపెన్ చేశారు. ఎవికె రెడ్డి ఆహ్వానితులను రిసీవ్ చేసుకున్నారు - ముగ్గురూ 'సవేరా' సోదరులు.... రాధాశివస్వామి, మాలతి కూడా వచ్చారు ఈనాటి ప్రారంభోత్స వానికి.... అతి నవీనమైన ఫర్నిచర్‌తో, అత్యాధునికంగా తీర్చిదిద్దిన ఈ హొటల్, సాగరతీరాన ఒక విశ్రాంతి సీమలా ఉంది. పిల్లలు ఆడుకొనేందుకు స్థలమూ, వోపెన్ ఎయిర్ థియేటరూ, విశాలమైన పార్కింగ్ ప్లేసూ వున్నాయి. ప్రకృతి వాడిలో, చల్లటి సముద్రపు గాలిలో, చిరుచీకటి బడ్డాక, ఒక స్వప్న మందిరమా అనిపిస్తూంది ఈ ప్రదేశం. ఎలియట్స్ బీచి కొచ్చినవారు ఇందు లోకి ప్రవేశించకుండా వెళ్లలేనంత ఆకర్షణ వుంది ఈ వాతావరణంలో.... హొటల్ నిర్వహణలో అనుభవం వున్నవారు తలపెట్టిన ఈ బీచ్ కాజిల్ మద్రాసు పౌరుల మధురానుభూతి కాగలదు.

—యన్నార్ చందూర్

నావద్ద ప్రేమ తప్ప మరొక ఆయుధం లేదు. ప్రపంచంతో స్నేహం చేసుకోవడమే నా గమ్యం.

ఆకలితో మాడుతున్న కుక్కని చేరదీసి, తిండి పెడితే, అది మిమ్మల్ని కరవదు. మనిషికీ కుక్కకీ గల తేడా అక్కడే.

—గాంధీజీ

సమీక్ష **చిత్రజగతి**

## గోపాల్‌రాజ్ ఫిలిమ్స్ 'గోదావరి పొంగింది'

'అమ్మా ఎంగే' (సేలమ్ మోడరన్ థియేటర్స్ 99వ ఫిలిమ్) తమిళ చిత్రానికి కథారచయితగాను, 'బృందావన' కన్నడ చిత్రానికి దర్శకునిగాను, యిలా అనేక చిత్రాలలో పేరూ, గుర్తింపూ తెచ్చుకున్న, సాంకేతిక నిపుణులు రాజగోపాల్, అనేక కష్ట నష్టాలు దాటుకుంటూ వచ్చి, కథాబలం అక్కడక్కడ సామాన్యంగా ఉన్నదని పించినప్పటికీ, చెవుల మీద నిలిచి మనసుని ద్రవింపజేసే పది పాటలతో (వేటూరి సాహిత్యం - మహాదేవన్ సంగీతం), కనులపండుగలా కనిపించే అతి రమణీయమగు దృశ్యాలతో, పరవళ్లు తొక్కే ప్రకృతి సోయగాలతో, అందాలు చిందించే నదీసుందరి నాట్యాలతో (కెమెరా: మారుతీరావు), ఫైటింగులూ ద్వంద్వార్థాలూ వెర్రి పోకడలూలేని ఈ కమనీయ చిత్రాన్ని రూపొందించారు ; 'ఎప్పట్లా గోదావరి ప్రవహిస్తోంది.' 'గోదారొడ్డున మామిడి తోట, పెళ్లికి విడిదంట' (గాత్రం ; సుశీల) - ఈ రెండు పాటలూనంది అవార్డుకి (1989) అర్హత కలిగించాయంటే ఆశ్చర్యంలేదు - అంత సుశ్రావ్యంగా ఉన్నాయి. మ్యూజికూ, ఫొటోగ్రఫీ - ఈ రెండూ పెద్ద ప్లస్ పాయింట్స్ చిత్ర విజయానికి. ఇకపోతే, ఈ చిత్రంలో అందరూ కొత్తవారే. కాని, సీజన్డ్ ఆర్టిస్టులకి ఏవిధంగాను తీసిపోనంత ఉన్నతంగా తమ పాత్రలకు ప్రాణం పోశారు.... అర్జున రావు (అర్జురావు), జేమ్సూ (కె వెంకటేశ్వర్లు) సెలవలికి ఆ ఊరు వస్తారు. ఐశ్వర్యవంతుడూ లాంఛివోనరూ అయిన అర్జునరావు తండ్రికి, భార్య ఏనాడో గతించడం వల్ల, మోతాదుకి మించిన స్త్రీ వ్యసనం. అగ్రకులీనుడైన హీరో, హరిజనకన్య సుందాలు (చందన) చిన్ననాటి ఆటపాటల స్నేహితులు ; వయసుతోపాటు వలపు చిగురిస్తుంది. ఆలయ ధర్మకర్తగారి కూతురు కళ్యాణి (దేవిక) క్రైస్తవ యువకుడు జేమ్సూ పరస్పరం ప్రేమించుకుంటారు. అర్జునరావు వారి వివాహం స్వయంగా జరిపించి సురక్షితంగా వారిని పట్నం పంపుతాడు గాని, తన చుట్టూ అల్లుకుంటున్నవల ఎటువంటి మూల్యం గ్రామీణ వ్యవస్థలో కోరుతుందో గ్రహించ లేకపోతాడు.

సీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచినకథ : పెళ్లిపీటల మీద అగ్నిహోత్రం చూసి మూర్ఛపోయింది. సంపన్నుడైన శ్రీనివాసరావు కుమార్తె లావణ్య .... ప్రమీలా సూర్యారావు దంపతుల సంతానం, విశాల, శర్మిలా, విమల .... రాజశేఖరం రాజేశ్వరీల సంతానం, ఈ మధ్యనే లండన్ నుంచి వచ్చిన డాక్టర్ నాగార్జున, మాటకిమాట చెప్పజెప్పే చందన....

ఇక చదవండి

బుక్ తీసుకుని, చదువుకోవాలని ప్రయత్నించింది విశాల. కాని, నాగార్జున రూపం, తియ్యటి వూహలకు గురి చేసింది.

9

అంధకారంలో వున్న ఈ లోకానికి వెలుగునివ్వాలన్న ఆత్రుతతో తూర్పు దిక్కు రాగ రంజితం చేస్తున్నాడు సూర్యభగవానుడు.

నును వెచ్చని లేతకిరణాలు కిటికీలో నుండి లావణ్య పడుకున్న మంచంపై పడుతున్నాయి. మెల్లగా కళ్ళు విప్పి చూసింది.

ఎదురుగా తండ్రి శ్రీనివాసరావు, పక్కగా మాధవరావు ఆయన భార్య శారద, పనిమనిషి సాంబం అందరూ. లావణ్యవైపే కన్నార్పకుండా చూస్తూన్నారు. నీరసించిన ముఖంతో, ....

"నేను ఎక్కడున్నాను .... నన్ను ఎక్కడ నుండి తీసుకొచ్చారు? వాళ్ళు రాలేదా....? వాళ్ళని మీరు రానివ్వ లేదా? ఎందుకని?" లావణ్య మాటలు వింటూ ఒకరి ముఖాలొకరు చూసు కొన్నారు.

శ్రీనివాసరావు, లావణ్య దగ్గరగా వచ్చి, ఆమె రెండు చేతులు గుండెల దగ్గరగా అనించుకుని, అడిగాడు ....

"లా....వ....ణ్యా .... ఏమిటమ్మా! ఏమిటి నీవు మాట్లాడేది? ఏమటమ్మ ఈ వైపరీత్యం?"

తండ్రి కన్నీళ్ళను అయోమయంగా చూసింది లావణ్య. డాక్టరకు ఫోన్ చేసాడు మాధవరావు.

ఆఘమేఘాల మీద డాక్టరు వచ్చాడు. వస్తూనే ఆయన కిట్ తెరచి, స్టెతస్కోప్ తీసుకొని, పరీక్షచేయటం మొదలుపెట్టాడు. ఆమె చేతి నందుకుని పల్స్ చూశాడు.

లావణ్య నవ్వింది.... విరగబడి నవ్వింది.... డాక్టర్ని చూసి. అతను తెల్లబోయాడు.

ఎందుకు .... మీరు ఇలా ప్రయాస పడుతున్నారు ? ఐయామ్ ఆల్ రైట్" - నవ్వే పెదవుల్ని బిగబట్టి అంది.

"లావణ్యా, ఏమైంది.... ఎలా వుంది, ఎందుకిలా జరిగింది ?"

"డాక్టర్.... ఏమి జరిగింది.... కాస్త కళ్ళు తిరిగాయి.... మైకం.... వచ్చింది. ఇప్పుడు నేను బాగానే వున్నాగా ! చెప్పండి డాడీతో.... నాకు బాగుందని.... నేను బయటికెళ్ళేందుకు పర్మిషన్ ఇవ్వమని" - అంటూ లేచి కూర్చుంది.

డాక్టరుతో బాటు అందరూ ఉలిక్కి పడ్డారు ఆమె మాటలకు. ఇప్పటివరకు అందరం హడలిపోతుంటే ఇదేమిటి .... ఇంత ఈజీగా తేల్చేస్తున్నది లావణ్య.... అని ఎవరి మనసులో వాళ్ళు అనుకున్నారు.

"లేదమ్మా ! ఈ పరిస్థితిలో నీవెక్కడికీ వెళ్ళేందుకు వీలులేదు. మీడాడీ అనుమతించినా, నేను అనుమతించటం లేదు."

"వాట్.... డాక్టర్... మీరు.... నాకే మయిందను కుంటున్నారు ?" నన్నెందుకు పోనివ్వనంటున్నారు ? నేను తప్పకుండా వెళ్ళాలి...." లావణ్య మంచం దిగింది.

"నో.... నీవు వెళ్ళేందుకు వీలులేదు ...." డాక్టర్ సైగతో అందరూ ఆమెను కదలనీయకుండా పట్టేసుకున్నారు.

ఆ చర్య ఆమెకు మరింత చికాకుని కలిగించింది. గింజుకుంది. ఇంకా పట్టు



దలతో ఆమెను మంచం మీద పడుకో బెట్టారు.

కాళ్ళు చేతులు గట్టిగా కొట్టుకుంటూ బలవంతాన లేవబోయింది.

"నో.... ఐ.... డోంట్ వాంట్ దట్ ఇంజక్షన్.... ఐ వాంట్టు గో అవుట్ .... ప్లీజ్ సెండ్ మి.... ప్లీజ్" - ఆమె అరుస్తూనే వుంది.... కాని ఇంజెక్షన్ చేసేడు డాక్టరు.

మాగన్నుగా పడిపోయింది లావణ్య.

"దిస్ ఈజ్ ఎ వెరీ డేంజరెస్ కేస్ .... మీరు ఈమెను ఎట్టి పరిస్థితుల్లో కూడ బయటకు పంపించవద్దు. చాలా జాగ్రత్తగా చూసుకోవాలి. ఇలాంటి వాళ్ళు బయటకు పోతే చాలా ప్రమాదం. నేను సైకియాట్రిస్ట్‌తో కన్‌సల్ట్‌చేసి, అవసరమైతే.... ఈమెని హాస్పటిల్లో అడ్మిట్ చేస్తాను.... త్వరలోనే బాగయి పోవచ్చు. డోంట్‌వరీ.... మిస్టర్ శ్రీని వాసరావ్," అని చెప్పి వెళ్ళాడు డాక్టర్.

## 10

కాలేజికి బయలుదేరి వెళుతూండగా అడిగాడు, క్రితం రోజు ఊరునుంచి వచ్చిన, మేనత్తకొడుకు రాజేష్.

"విశాలా, సాయింకాలం పిక్చర్‌కి పోదాం - త్వరగా వస్తావా ?"

అతనివైపు తీక్షణంగా చూసింది విశాల.

వెళ్ళబోతున్న ఆమె కడ్డునిలిచి .... "పిక్చర్‌కి పోదాం," అని రెట్టించాడు. ఆమె విరాకు పడింది.

బంగారు గుడ్లు పెట్టబోతున్న బాతుని స్వంతం చేసుకోవాలి.... అను కున్నాడు అతను.

సూర్యారావు చెల్లెలు కొడుకు రాజేష్. ఆమెకు భర్తలేనందున అన్న గారి సహాయం పొందుతోంది. "రాజేష్ పాడయి పోతున్నాడు .... వాడిని బాగుచేసే బాధ్యత నీదే, అన్నయ్యా" అని సూర్యారావు దగ్గర కన్నీళ్ళు పెట్టుకుందామె. విశాలనిచ్చి పెళ్ళి చేస్తే, రాజేష్ బాగుపడతాడనే సూర్యా రావు యోచనని ప్రమీల ఎంత మాత్రం ఆమోదించలేదు.

'విశాలను పణంగా పెట్టాలని చూస్తున్నారా ?' అని కూడా అంది. మేనమామ సూర్యారావు అలుసు చూసుకు, రాజేష్ స్వతంత్రంగా ఎప్పు డంటే అప్పుడు వస్తూపోతూన్నాడు.

✠ ✠ ✠

విశాల కాలేజీ కెళ్ళింది. కాని చందన రమ్మని చెప్పటంవల్ల, శెలవు పెట్టి, బయలుదేరిందక్కడికి.

"చందూ.... నీ ఫ్రండ్ తరుచూ వస్తుందా ?" చందనని ప్రశ్నించాడు నాగార్జున.

"ఆరుమాసాలకు ఒకసారి"

"అలా అనిపించలేదే ! ఇవ్వాళ రమ్మన్నావు కదా ?"

"చూడగా చూడగా మా స్వీటీ నీకు చాలా నచ్చినట్లుందే.... మేళ తాళాలతో తెచ్చేసుకుందామా ?"

"నీకంత ఆశగా వుంటే.... అలాగే కానియ్."

"నాకా.... నీకా...."

"నీకే"

"కాదు - నీకే"

ఇంతలో విశాల వచ్చింది.

"మీరు మా ట్లో డు కుం టూ వుండండి. నేను వెళ్ళి వేయించిన జీడి పప్పు ప్లేటు తీసుకొస్తాను," అంటూ లోనికి వెళ్ళింది చందన. విశాల నాగార్జున మిగిలిపోయారు.

"ఏమి చదువుతున్నారు ?"

"బి. ఇ. ఫైనల్"

"మీరు నాకు చాలా నచ్చారు" మెల్లిగా చెప్పాడు.

"మీరు నాకు నచ్చలేదు" అంది విశాల.

"థాంక్యూ.... ఆఁ....ఆఁ ఏమి టన్నారు....?"

అమె నవ్వింది-మల్లెలచల్లదనంలా, మంచి గంధంలోని పరిమళంలా. జీడిపప్పుల ప్లేటుతో వచ్చింది చందన.

తను ఎందుకు నచ్చలేదో అడగా లనిపించింది నాగార్జునకు. అల్లరికన్న దేమో, నిజంగా నచ్చకపోతే ఆ కను కొలకులోని కాంతులు కర్దం....

"ప్లేన్ క్రాష్ విషయం విన్నాక,.... నీవు చాలా ధైర్యంగా ప్రవర్తించావట .... ఆడపిల్లలు అలాగే వుండాలి. ఏ అసందర్భమయినా జరిగినపుడు, కన్నీళ్ళు కార్చడం గాక, ఆపదలను ధైర్యంగా ఎదుర్కోవాలి," అని విశాలని మెచ్చుకున్నాడు అప్పుడే హాలు లోకి వచ్చిన రాజశేఖరం.

"నేనేమీ చేయలేదంకుల్" అంది విశాల నమ్రతగా.

"ఏమి చేయకున్నా సరే.... బెంబేలు పడకుండా వుండటమే కావలసింది. ఏర్‌పోర్ట్ వాళ్ళని కనుక్కోవటం, లండన్‌కి ఫోన్ చేయటం,.... వీళ్ళకు తోడుగా వుండటం.... ఇవన్నీ నీలోని ప్లస్ పాయింట్సే కదమ్మా!" అన్నా రాయన.



## సినిమా పేరు ?

**చింతకు చిగురే సింగారం**
**మనిషికి పొగరే బంగారం**

**గేయరచన : శ్రీ శ్రీ ; పాడినవారు : యస్పి బాలసుబ్రహ్మణ్యం**

ఆ పాట ఏ చిత్రంలోనిది ? సరిగా చెప్పగలిగిన మొదటి యిరువురికీ పదేసి రూపాయలు బహుమతి. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి, మొదటి యిరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది.

**మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి : చివరి తేదీ : 10-9-1990**



JAGATI, 2, Kutchery Road, PB 2922, Mylapore, Madras-600 004.



"విశాలను వాళ్ళ ఇంటి దగ్గర వుంది ...." అంది రాజేశ్వరి, నాగార్జునతో.

ఫ్రంట్ డోర్ తెరచి,.... దూరంగా వున్న వాళ్ళకి వినిపించకుండా మెల్లిగా చెప్పాడు. "వెనుక సీట్లో కూర్చుని నన్ను కేవలం డ్రైవరుగా చేయకండి. ప్లీజ్ కీప్ కంపెనీ" - వేడికోలుగా చెప్పాడు.

సంతోషంగా చేయి వూపింది చందన, "అన్నయ్యా .... బెస్ట్ ఆప్ లక్," అంటూ. ఎందుకలా చెప్పిందో విశాలకు లీలగా అర్ధమయినట్టనిపించింది.

## 11

క్షణ క్షణానికి కోపం వచ్చేస్తోంది రాజేష్ కు.

"చూసారా, ఆంటీ, మీ డాటర్.... ఇంకా రాలేదు."

"పోనీలే రాజేష్, విమ్మి వస్తానంటోంది గా తీసుకెళ్ళు"

"ఎందుకలా చెప్పాలి ?"

'ఏదో పనివుండి ఆగిపోయిందేమో.'

"కావాలనే రాలేదు."

"ఖచ్చితంగా వస్తానని చెప్పివుండదు రాజేష్"

" నేను రడీ....వెళ్దాం పద," అని పిలిచింది విమ్మి.

తను ఆశపడి టికెట్స్ కూడ తీసుకు వస్తే, విశాల తన మాటను లెక్కచేయ లేదు - పనిగట్టుకు అవమానించింది.

ఇంటి ముందు కారాగిన చప్పుడు విని బయటకొచ్చిన రాజేష్, ఉక్రోషంతో వూగిపోతున్నాడు.

గుమ్మానికి చేతినడ్డుపెట్టి, "ఆగు" అన్నాడు లోపలకు వెళ్ళబోతున్న విశాలను శాసిస్తూ, "ఎవరతను .... ?"

రాజేష్ మామూలుగా అడిగివుంటే చెప్పేదేమో .... అలా అధికారం ఉన్నట్టు ప్రశ్నించేసరికి ఆమె అభిమానం దెబ్బతిని "అతనెవరైతే నీకెందుకు ?" అని అడ్డుపెట్టిన చేతిని తోసేసి లోపలకెళ్ళింది.

రుస రుసలాడుతూ ఆమె వెనుకే వచ్చి, "విశాలా" అని గట్టిగా అరిచాడు.

కోపంతో వెనక్కి తిరిగి చూసింది విశాల.

"అతనెవరో చెప్పమంటే అలా వెళ్ళిపోతావేం ?"

"అతనెవరో నీకు చెప్పాల్సిన అవసరం నాకు లేదు."

"కాబోయే హజ్బెండ్ అని తెలిసి కూడా అలా తిరస్కారంగా .... మాట్లాడతా వేమిటి ?"

"నీవు నాకు కాబోయే హజ్బెండ్ అని ఎవరు చెప్పారు ? అటువంటి పిచ్చి పిచ్చి ఆలోచన పెట్టుకోకు."

"సిగ్గులేదూ, అలా మాట్లాడేందుకు ?" అంది విమ్మి.

"తప్పుచేస్తే సిగ్గుపడాలి, తప్పు చేయని దానికి సిగ్గెందుకట ?"

"ఏమిటమ్మా విశాలా, ఎందుకీ గొడవ ?" ప్రమీల అడిగింది.

"రాజేష్ .... నీవు రా .... మనం పిక్చర్ కి పోదాం. వాళ్ళతో ఎందుకీ

అనవసరపు వాదులాట? అక్కడ పిక్చర్ బిగిన్ అయిపోతుంది" అంది విమ్మి.

"వదిలి పెడతానా.... అంతు చూడనూ?" పాములా బుస కొట్టాడు రాజేష్.

## 12

"నాకు తలనొప్పిగా వుంది, మమ్మీ నేను రాలేను ఆపార్టీకి" అని చెప్పింది విమ్మి. తనవంతు ఎలా తప్పించుకోవాలా అనుకుంటున్న శమ్మి, "ప్లీజ్ మమ్మి .... నేను రాను.... నా ఫ్రెండ్ బర్త్ డే .... నేనక్కడికి వెళతాను."

"మీరు అసలు వినిపించుకోరు కదా .... రాజేశ్వరి .... ఎన్నిసార్లు చెప్పింది అందర్నీ రమ్మని అంది విసుగ్గా ప్రమీల

"వాళ్ళు రానంటే ఎందుకలా ఏడిపిస్తావు? వాళ్ళేమి చిన్నవాళ్ళా? వాళ్ళ అభిరుచులు వాళ్ళవి," అని సముదాయించాడు సూర్యారావు.

విశాల, ప్రమీల, సూర్యారావు ముగ్గురూ పార్టీకెళ్ళారు. శమ్మి తన దారిన తను వెళ్ళిపోయింది. విమ్మి మాత్రమే మిగిలిపోయింది. వీళ్ళందరు వెళ్ళిన పది నిమిషాలకు రాజేష్ వచ్చాడు.

అతని వడిలోవాలిపోయింది విమ్మి.

అందం చిందే ముఖారవిందమునకు ఎల్లప్పుడు వాడండి.
అశోకా
శాండల్ వుడ్ టాల్కం పౌడర్లు
"ASOKA"
ALL PURPOSE
SANDAL WOOD
Powder
"ASOKA"
Sandalwood
TALCUM POWDER
ASOKA
Sandalwood
FACE POWDER
అన్నూ
బ్రిలియన్‌టయిన్
నల్లని కురులకు
చల్లదనమునకు
తప్పక వాడండి

కారు దిగిన ముగ్గుర్ని చూచి, "విమ్మీ శమ్మీ రాలేదా?" అని అడిగింది రాజేశ్వరి.

"వాళ్ళు రాలేదు" - ముక్తసరిగా సమాధానం చెప్పింది ప్రమీల. "నీవు వచ్చావు కదమ్మా బాలు"— అన్నట్టు విశాల నడుము చుట్టూ తన కుడిచేయి వేసి, దగ్గరగా తీసుకుని నుదుట ముద్దు పెట్టుకుంది రాజేశ్వరి.

దూరాన్నుండి గమనించిన నాగార్జునకి ఏదో తృప్తిగా ఉంది. విశాల అంటే మమ్మికీ కూడా ఇష్టమే.... అనుకున్నాడు.

సూర్యారావు .... ప్రమీలలకు నమస్కరించాడు నాగార్జున.

అతనిలోని అణకువ చూసి .... ఎంతో ముచ్చట పడ్డారు వాళ్ళు. చందన వచ్చి విశాలను లాక్కుపోయింది తన ఫ్రెండ్స్ దగ్గరకు. అందరూ పార్టిలో కలసిపోయారు. అప్పుడప్పుడు విశాలను చూడకుండా వుండలేక పోయేడు నాగార్జున.

ఆమె ధరించిన గులాబి రంగు షిఫాన్ చీర, పచ్చని దేహానికి మరింత వన్నె తెచ్చింది.... ఆమె మాట్లాడుతూ వుంటే చిరుగాలికి కదిలే గులాబీ రేకుల్లా వున్నాయి ఆమె అధరాలు. నల్లటి కురుల నిగ నిగలు ఆమె సౌందర్యాన్ని యినుమడింప జేస్తున్నాయి.

ఆమె చేతినందుకుని లాగుతోంది చందన. ఆమె రానంటోంది.

అందరూ ఆమెనెందుకు బ్రతిమలాడుతున్నారో.... అర్థం కాలేదు నాగార్జునకి.

విశాల దూరంగా వెళ్ళి నిలుచుంది.

ఆ అవకాశాన్ని వినియోగించుకున్నాడు నాగార్జున.

"ఎక్స్‌క్యూజ్ మి...."

ఆమె తిరిగి చూసింది.

"మీరు పార్టీకి వచ్చి, మమ్మల్ని సంతోష పెట్టినందుకు.... థ్యాంక్స్" ....చేతిలోని కూల్‌డ్రింక్ అందించాడు.

అదందుకుని చిరునవ్వు నవ్వింది విశాల.

"మిమ్మల్ని పాట పాడమంటున్నారు వాళ్ళు."

కళ్ళు కొంచెం పైకెత్తి అతన్ని చూసింది.

"మీరు పాట పాడితే ఎక్కువ ఆనందపడేది.... నేనే...."

చందన విశాలను తీసుకెళ్ళి మైక్ చేతిలో పెట్టింది.

ఏ గంధర్వలోకం నుంచో వచ్చి దేవకన్య పాట వింటున్నట్టుగా అందరూ పరవశించి పోయారు.

పార్టి ముగిసింది - ప్రమీల, సూర్యారావులతో విశాలకూడ ఇంటికి వచ్చేసింది.

## 13

స్వర్గం చవిచూసిన మత్తులో తన బెడ్‌రూమ్‌లోకి వచ్చి పడుకుంది విమ్మి.

రాజేష్ హాల్లో కూర్చుని సిగ్నరెట్ పీలుస్తూ,.... ఏదో పుస్తకం గెచేత బుచ్చుకున్నాడు.

"శమ్మి ఇంకా రాలేదా....?" అడిగింది ప్రమీల.

"విమ్మి నిదుర పోతోంది - శమ్మి యింకా రాలేదు...." అన్నాడు రాజేష్.

ప్రమీల, విమ్మి పడుకున్న గది గుమ్మం దగ్గరకెళ్ళి తొంగిచూసింది. ఆమె గాఢనిద్ర పోతున్నట్టు కనిపించింది.

ఇంకో అరగంట తరువాత శమ్మి వచ్చింది.

"శమ్మీ ఏమిటది - ఇంతరాత్రి దాకానా....?" అని గదమాయించింది ప్రమీల.

"ఇవ్వాళ్టికి వూరుకో" అని సర్ద బోయాడు సూర్యారావు.

"ఏమైనా జరిగితే అనుభవించేది మనమే...."

వివర్ణమైన ముఖంతో.... ప్రమీల వైపు చూశాడు సూర్యారావు.

"డాడీ, మరెప్పుడూ లేటుగా రాను డాడీ...." - అని తండ్రికి అప్పీలు చేసుకుంది శమ్మి. నెమ్మదిగా శమ్మి అక్కడనుండి దాటుకుంది.

విశాలకు మటుకు తల్లి ఆందోళనకు తగు కారణం వున్నదేమోననిపించింది గాని పైకి ఏమీ అనలేదు.

## 14

శమ్మి కాలేజికి సరిగా అటెండ్ కావటం లేదనీ, ఆమెకు ఒక బాయ్ ఫ్రెండ్ వున్నాడనీ అతనితో షికార్లు తిరుగుతోందనీ, అతనితో స్కూటర్ మీద వెళుతూ పడ్డదనీ, అది క్రికెట్‌లో తగిలిన దెబ్బకాదనీ తెలుసుకున్న విశాల ఆశ్చర్యపోయింది.

అమాయకంగా కనిపిస్తున్న తన చిన్న చెల్లెల్లు, .... ఇంతటి నిగూఢంగా ప్రవర్తిస్తోందా....? ఇదంతా నిజమా! .... మనసుని కల్లోలపరిచే ఆలోచనల్ని అదుపులో పెట్టుకు, బస్ స్టాప్‌లో నిలుచుంది విశాల. చాలా సేపటికి గాని బస్సురాలేదు. బి.ఇ అయిపోయి, జాబ్‌లో చేరిన వెంటనే స్కూటరు

రుచిలో నెం.1
క్రేన్ వక్కపొడి
దక్షిణ భారతదేశపు నెం.1 వక్కపొడి
CRANE
CRANE

కొనుక్కోవాలనిపించింది. అదే సమయంలో ఆమె ముందు నుంచి దూసుకు పోయింది ఒక స్కూటరు, నడుంచుట్టు చేయి వేసి నవ్వుతూ కూర్చున్న అమ్మాయిని చూసి, తన కళ్ళను నమ్మలేక పోయింది విశాల.

ఈ విషయం విన్న ప్రమీల కృంగిపోయింది.

"నేననుకుంటూనే వున్నాను ఇలాంటి దేదో జరుగుతుందని! మీ డాడీ ఇచ్చిన స్వేచ్ఛను వాళ్ళు దుర్వినియోగం చేసుకుంటున్నారు. అది ఆయన గ్రహించలేక పోతున్నారు."

"డోంట్ వరీ మమ్మీ! శమ్మి వచ్చాక కనుక్కొందాం" అని తల్లిని ఓదార్చింది విశాల.

## 15

"నాకిప్పుడే మ్యారేజి చేసుకోవాలని లేదు.... ముందు చందూకి ఏర్పాటు చేయండి."

"ఇద్దరికీ ఒకేసారి ఏర్పాటు చేయాలనుకుంటున్నాను," అన్నాడు నాగార్జున తండ్రి.

చందన అక్కడకు వచ్చింది అప్పుడే.

"చెల్లెమ్మా, నీకు పెళ్ళంట" మెల్లని స్వరంలో వెక్కిరింపుగా చెప్పాడు నాగార్జున.

"డాడీ.... ముందు అన్నయ్యకు చేసేద్దాం.... కాస్త అల్లరన్నా తగ్గుతుంది ఆ వదినమ్మ వస్తే"

"ఏమిటీ, నేనా అల్లరి చేసేది, అబద్ధం.... మమ్మీ, మీరు చూస్తూనే వుంటారు కదా! ఈ చందూ ఎంత పెంకిదో ముందు ఆమెకు చేస్తేనే, ఇంటికి అల్లరి తగ్గి, పాపం గ్రాండ్‌మా కూడా కొంచెం నెమ్మదిగా వుంటుంది."

"వూ.... మధ్యలో గ్రాండ్‌మా ఎందుకట? ఆమె ఎప్పుడూ నీవైపే.... మాట్లాడుతుందిలే.... ఇంటిపేరు నిలిపే మనవడవట... మహా.... అందుకే నీవంటే ప్రేమవలకపోస్తుంది," మూతి ముడిచింది చందన.

"చాలించండ్రా మీ వాదులాట, అలా పోట్లాట మాని చెప్పండి, మీ ఉద్దేశాలు ఏమిటీ?"

"కట్నం తీసుకునే వరుడ్ని నేను చేసుకోను"

"ఈ రోజుల్లో అది సాధ్యమా చందూ?"

"మమ్మీ అది సాధ్యమా అని ప్రతి ఆడపిల్ల తల్లిదండ్రులూ అనుకుంటే, ఇక వరకట్నపిశాచిని ఎవరు అంత మొందిస్తారు?

"అందుకు నీవు కంకణం కట్టుకోవాలనుకుంటున్నావా?"

"ఏమైనా సరే, కట్నం తీసుకునే వ్యక్తిని నేను చేసుకోను.... హాయిగా పెళ్లిలేకుండానే వుండిపోతాను."

రాజేశ్వరి ఉలిక్కిపడింది ఆ మాట విని! "చందూ!" అంది ఆర్తిగా.

"మమ్మీ, కట్నంతో భర్తని కొనుక్కోవటం, నాకిష్టం లేదు"

అంత కచ్చితంగా మాట్లాడే కూతుర్ని చూచి, "అలాగే నీ ఇష్ట ప్రకారమే ప్రయత్నిస్తామమ్మా!" అన్నాడు రాజశేఖరం.

"థాంక్యూ డాడి...." అంది సంతోషంగా.

"అన్నయ్యా.... నీవు కూడ చెప్పేసెయ్"

"ఏమని....?"

"అయ్యో ఖర్మ.... అది కూడ తెలియదా ?" చెవిలో మెల్లగా చెప్పింది. "ఆ స్వీటీని పెళ్ళిచేసు కుంటానని."

"ఇపుడా....?"

"ఏమిటమ్మా ఆ సీక్రెట్స్....?"

చందూని పక్కకు లాక్కెళ్ళి, "నీకేమయినా సెన్స్ వుందా....? ఆ అమ్మాయి పర్మిషన్ లేకుండా, డాడీ వాళ్ళతో చెపితే, ఒకవేళ ఆమె అంగీకరించకపోతే...."

"అయ్యో పిచ్చన్నయ్యా.... ఆ స్వీటీకి నీవంటె ఎంత 'యిదో' నాకు తెలుసు."

నాగార్జున కళ్ళు మెరిశాయి. "ఎందుకైనా మంచిది ఒకసారి సంప్రదిస్తే ..... సరిపోతుంది.... హాస్పటలకు టైమయింది."

## 16

"శమ్మి.... ఎవరా అబ్బాయి....?" అడిగింది విశాల.

"ఏ అబ్బాయి .....?"




క్రివేణి® ఇంకు
గమ్
ఆఫీసు పేస్ట్
వాడి,
వాటి విశిష్ఠతను
గమనించండి.
kriveni
kriveni
IS:1221-71
ISI
తయారుచేయువారు:
కృష్ణవేణి ఇంకు ఫ్యాక్టరీ
751, తిరువత్తియూర్ హై రోడ్, మద్రాసు-600 081

"తెలియనట్టు నటించకు... అడిగిన దానికి సమాధానం చెప్పు."

"చెప్పకుంటే....?"

"డాడీదాకా వెళ్ళవలసి వుంటుందీ విషయం."

"వెళ్ళనీ,.... నీలా.... కుళ్ళు లేకుండా, ఆయనే సెటిల్ చేస్తారు."

శమ్మి చెంప ఛెళ్ళుమంది.

కొట్టింది విశాల కాదు - ప్రమీల. .... "పెద్ద చిన్నా అని కూడ లేకుండా ఏమిటా ఎదిరింపు ?"

"హుఁ.... పెద్దది.... నా జీవితాన్ని చూచి ఓర్వలేకుండా వుంది. తనకన్నా చిన్నదాన్ని ఏదో బాగుపడిపోతున్నానని....మీకందరికీ చెప్పి బెదిరిస్తోంది"

"మమ్మీ.... నన్ను ఎన్నయినా అననీ.... కాని.... తన జీవితాన్ని తెలుసుకోమను.... ఈ కొత్త కొత్త రంగులు.... కొన్నాళ్ళకు వెలిసిపోతాయనీ, తల్లిదండ్రులకు అగౌరవం వచ్చేట్లు ప్రవర్తించ కూడదనీ. తెలుసుకుంటే చాలు మమ్మీ డాడీతో మాట్లాడి, చట్టరీత్యా అతనికి భార్య గావచ్చు కదా! ఈ దొంగ తిరుగుళ్ళు భవితవ్యానికి మంచివి కాదు" - నిష్కర్షగా చెప్పింది విశాల.

"నావి కాదు దొంగ తిరుగుళ్ళు - పొంచి చూసే నీదే ఛండాలపు బుద్ధి."

"పొంచి చూడవలసిన అవసరమేముంది ? భార్యభర్తలంత పబ్లిక్‌గా నీవతనితో పట్టపగలు పబ్లిక్‌రోడ్డు మీదేగా వెళ్ళావు. మరి ఇందులో పొంచి చూసిన దేముంది ? ఒక్కటిగుర్తు పెట్టుకో.... ఈ స్కూటరు ప్రేమ కలకాలం నిలిస్తే.... నీవు అదృష్టవంతురాలివే.... లేకుంటే.... ?"

"షటప్.... అతనిమీద నాకు నమ్మకముంది. అతనంటే ఏమనుకున్నావ్ ?" - సీరియస్‌గా అంది శమ్మి.

"ఓ.కె. నీకంత నమ్మకం వుంటే ఫర్వాలేదు.... వయసుతీరు అంతేలే .... నీవతన్ని అడిగి కనుక్కో.... మన నుంచి ఏమీ ఆశించకుండానే....అతను నిన్ను వివాహం చేసుకుంటాడేమో !"

"నాన్సెన్స్.... నాకు ఆస్థి ఇవ్వకుండా, కట్నం ఇవ్వకుండా ఇలా తొలగించుకోవాలని చూస్తున్నారా ? .... అదంతా కుదరదు - నాకు రావలసిన వాటా నాకుంటుంది."

"పిచ్చి పిల్లా ........ ఆస్తుల విషయం కాదు నేను మాట్లాడుతున్నది. నీ భవిష్యత్తు.... కేవలం కట్నం కొరకు గడ్డి తింటున్న ఈ రోజుల్లో.... నిన్ను వాళ్ళు.... అభిమానంగా ఆహ్వానిస్తారేమో కనుక్కోమంటున్నాను."

"అదంతా నీకనవసరం, నేనతన్ని ఇష్టపడ్డాను....అతన్నే చేసుకుంటాను."

"అలాగే కానియ్ - ప్రస్తుత కాలంలో స్త్రీకయినా, పురుషునికైనా చదువు ఎంతో ముఖ్యం, జీవనాధారం కూడా ! డిగ్రీ ముగించు.... ఆపైన నీ ఇష్టం"

"వుహు, నాకు చదువుకోవాలని లేదు. అతను నన్ను ఇష్టపడ్డాడు. నేను మేజర్ని. మీ బెదిరింపులు నన్ను ఆపలేవు, మీరొద్దన్నా మేము పెళ్లి చేసుకు తీరుతాం. అండర్‌స్టాండ్," అంది శమ్మి. (ఇంకా వుంది)

స్త్రీల టానిక్

లోధ్ర

బాధారహిత
ఆరోగ్యమును స్త్రీలకు
90 సంవత్సరములుగా ఇచ్చుచున్నది.
ఉచిత వైద్య సలహాకు ఈ కూపను
మీ వ్యాధి వివరములతో పంపండి

పేరు ..................................................
..................................................
విలాసము ..................................................
..................................................
..................................................
.......... PIN ..................................................

తయారుచేయువారు
కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-600 014.

ఏజంట్లు సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్,
విజయవాడ - 1 - సికిందరాబాద్

---

JAGATI Telugu Monthty - Vol. 35 - No 410 - Seqt 90

Edited, Printed and Published by N. R. Chandur at
MANASA PRESS, 2 Kutchery Road, Madras- 600 004
Phone: 7 6 6 9 7